నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు.
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122/PP tel

## ప్రతి గ్రంథాలయంలోను ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

**డాల్టన్ ఏజన్సీస్**
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

---

## శ్వాన్ పెన్నులు
### అంతరిక్ష యుగ విద్యార్థులకు











ఆధునిక తరానికి శ్వాన్ పెన్నులు. శ్వాన్ మాత్రమే మెత్తగా తేలికగా జారిపోతూ వ్రాస్తుంది. శ్వాన్ ఆక్స్‌ఫోర్డ్ గాని కేంబ్రిడ్జ్ గాని తీసుకోండి—ఆనందంగా చంద్రగోళంపై అడుగుపెట్టండి.



శ్రేష్ఠమైన ఫలితాల కోసం




**శ్వాన్**
డీలక్స్ ఇంకుతో
వ్రాయండి.



**శ్వాన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్**
అద్వాని చాంబర్స్ పి. మెహతా రోడ్డు,
బొంబాయి-1
బ్రాంచి: 84బి. కన్నాట్ ప్లేస్ క్రొత్త ఢిల్లీ.




hero's SI-120 tl

ప్రియమైన తాతయ్యకు,

నా పుట్టిన రోజు వచ్చే నెల వస్తుంది. నాన్న ఆంధ్రా బ్యాంకు నుండి నాకు ఒక చక్కటి బొమ్మను తెచ్చారు. దాన్ని కిడ్డీ బ్యాంకు బొమ్మ అంటారు. ఎప్పుడూ డబ్బులు కావాలని మారాం చేస్తుంది. అందులో నేను డబ్బు వేసినప్పుడల్లా అది తియ్యగా నవ్వుతుంది. ఆ నవ్వు నాకెంతో ఇష్టం, ఏడిస్తే నచ్చదు.

వచ్చే నెల నా పుట్టిన రోజు వస్తుంది. దానికి బహుమానం పంపుకుంటావు గదూ.

నీ ప్రియమైన
రఘు




దీ ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్






FDS AB 1747 TE A





# చందమామ


సంస్థాపకుడు: నాగిరెడ్డి

సంచాలకుడు: 'చక్రపాణి'


ఈ నెల బేతాళ కథ ["తారుమారు"] ఎస్. కే. రాజేశ్వరీరాణి పంపినది.

"భర్త కోసం" అన్న పెద్ద కథ వచ్చే సంచికలో పూర్తి అవుతుంది.

ఈ సంచికలో "యక్షపర్వతం" అన్న కొత్త రంగుల బొమ్మల సీరియల్ ప్రారంభమవుతున్నది. కిందటి నెల ముగిసిన "రాతిరథం" లోని పాత్రలు కొన్ని ఈ కొత్త సీరియల్‌లో తటస్థపడగలవు. "మానవస్వభావం" అన్న కథలో మనస్తత్వం పరిస్థితులకు అనుగుణంగా ఎలా మారేదీ చక్కగా కనబడుతుంది.


సంపుటి 50 మే '72 సంచిక 5











దుష్టా భార్యా, శఠో మిత్రం,
భృత్యో హంకారసంయుతః,
ససర్పే చ గృహే వాసో,
మృత్యు రేవ న సంశయః. 1

[చెడ్డ భార్యా, శఠుడైన మిత్రుడూ, అహంకారి అయిన భృత్యుడూ, పాము తిరిగే ఇల్లూ ప్రాణాంతకమైనవన్నది నిశ్చయం.]

యస్మిన్ దేశే న సన్మానో,
న ప్రీతి, ర్నచ బాంధవాః,
న విద్యా, నాస్తి ధనికో,
న తత్ర దివసం వసేత్. 2

[ఏ దేశంలో సన్మానమూ, ప్రీతి, బంధువులూ, విద్యా, ధనికులూ ఉండరో అక్కడ ఒక్క రోజైనా ఉండరాదు.]

కుచేలినం, దంతమలాపహారిణం,
బహ్వాశినం, నిష్ఠురవాక్యభాషిణం,
సూర్యోదయే చాస్తమయే చ శాయినం,
విముంచతి శ్రీ రపి చక్రపాణినం. 3

[మురికి బట్టలు ధరించేవాడూ, పళ్ళు తోముకోనివాడూ, తెగ తినేవాడూ, నిష్ఠురాలు పలికేవాడూ, ఉదయమూ సాయంకాలమూ నిద్రపోయేవాడూ విష్ణుమూర్తి అయినా సరే లక్ష్మి విడిచిపెట్టేస్తుంది.]

కూడనివి



# మానవస్వభావం

ఒక గ్రామంలో దానయ్య అనే పేద రైతు ఉండేవాడు. అతనికి గల కొద్ది పాటి పొలం మీద వచ్చే ఆదాయం అతని కుటుంబానికి సరిపోయేది కాదు.. అందువల్ల అతను అప్పులు చేసి, బాకీలు తీర్చలేని స్థితికి వచ్చాడు.

"ఉంటే తిందాం, లేకుంటే పస్తులుందాం. పొలం అమ్మేసి ఋణ బాధ నుంచి విముక్తి పొందటం మేలు," అని ధానయ్య భార్య సలహా ఇచ్చింది. ఆమె సలహా ప్రకారం దానయ్య తన పొలాన్ని అమ్మకానికి పెట్టాడు. కష్టాలలో ఉండి అమ్ముకుంటున్నాడు గనక సాధ్యమైనంత తక్కువ ధరకు పొలం కొనుక్కుందామని ఊళ్ళో వాళ్ళు నోటికి వచ్చిన ధర అడగ సాగారు.

ఆ వూళ్ళోనే శీనయ్య అనే మరొక రైతు ఉన్నాడు. దానయ్య తండ్రి తాతలు బాగున్న కాలంలో శీనయ్య తాత తండ్రులు వారి నుంచి సహాయం పొందారు. ఈ సంగతి శీనయ్య విని ఉండటంచేత, అతను న్యాయమైన ధర ఇచ్చి దానయ్య పొలం కొన్నాడు.

ఆ డబ్బుతో దానయ్య తన అప్పులన్నీ తీర్చి, సంసారం జరగటానికి గాను కూలి పనులకు వెళ్ళ సాగాడు. ఆ సంగతి తెలిసి శీనయ్య దానయ్యతో, "పొలం పనులు చెయ్యదలిస్తే నీ పొలమే కౌలుకు చెయ్యరాదా? నీకూ, నీ కుటుంబానికీ ఏ లోటూ లేకుండా నేను చూస్తాను," అన్నాడు.

"అంతకంటేనా? మీరు మా పాలిటి దేవుడులాటి వారు!" అని దానయ్య ఆ రోజే శీనయ్య వద్ద పనికి కుదిరాడు.

ఒకనాడు దానయ్య తాను శీనయ్యకు అమ్మిన చెక్క దున్నుతూ ఉండగా నాగలి కర్రుకు ఏదో అడ్డు తగిలింది. పలుగుతో తవ్వి చూస్తే రెండు లంకె బిందెలు! వాటిక

సింగంపల్లి అప్పారావు



కట్టిన వాసెనలు విప్పి చూస్తే, బిందెల నిండా బంగారు నాణాలూ, నగలూ ఉన్నాయి.

దానయ్య వెంటనే ఆ రెండు బిందెలనూ భుజాని కెత్తుకుని తిన్నగా శీనయ్య ఇంటికి తెచ్చి, "బిందెలు పొలంలో దొరికాయి. జాగ్రత్త పెట్టండి. నేను ఎడ్లను పొలంలో వదిలి వచ్చాను, వెంటనే వెళ్ళాలి," అన్నాడు.

దానయ్య నిజాయితీకి ఆశ్చర్యపోయి శీనయ్య, "దానయ్యా, నీ నిజాయితీ ఏమని చెప్పాలి! ఇంత ధనం దొరికితే నువ్వు ఉంచేసుకోకుండా తెచ్చి నాకిచ్చావు. కాని ఇవి దొరికింది నీ పొలంలోనే గనక న్యాయంగా ఈ బిందెలు నీవే!" అన్నాడు.

"అదేమిటి, బాబూ? ఆ పొలం మీకు అమ్మినాక మీదే అవుతుంది గాని నాది ఎలా అవుతుంది? అందులో ఏమి దొరికినా అది మీదే! మీ దయ వల్ల ఆ పొలం నేనే చేస్తున్నాను గాని, కావాలనుకుంటే దాన్ని మీరు ఎవరి చేతనైనా చేయించ వచ్చు గద," అన్నాడు దానయ్య.

"చూడు, దానయ్యా! పొలంలో పండించుకునే హక్కు కొన్నాను గాని, ఇలాటి నిధి నిక్షేపాల ధర నేను నీకిచ్చానా? ఎవరు పొలం చేసినా, ఈ నిధి న్యాయంగా నేను నీకు ఇవ్వవలసిన వాణ్ణే! న్యాయం తప్పి నడిస్తే దేవుడు మెచ్చుతాడా?" అన్నాడు శీనయ్య.

"నేను చెప్పేదీ అదే, బాబూ. అందులో ఒక్క నాణెం తీసుకుంటే నన్ను దేవుడు మెచ్చుతాడా? ఎంత అధర్మం!" అన్నాడు దానయ్య.

తమ ఇద్దరికీ న్యాయం చెప్పమని వాళ్ళు గ్రామాధికారి వద్దకు వెళ్ళి, తమ సమస్య చెప్పుకున్నారు. ఆ సమయంలో గ్రామాధికారి తమ్ముడు గోపయ్య అక్కడే ఉన్నాడు.

వాళ్ళు తెచ్చిన సమస్య గ్రామాధికారికి చాలా విడ్డూరంగా తోచింది. ఆయన అంతా విని, "దీనికింత గొడవ దేనికి? ఇద్దరూ చెరొక బిందే తీసుకుంటే ఎవరికీ అన్యాయం ఉండదు కదా!" అన్నాడు.

అందుకు వాళ్ళిద్దరూ ఒప్పుకోలేదు. అంత అన్యాయం తాము చెయ్యలేమని ఇద్దరూ ఏకగ్రీవంగా అన్నారు.

గోపయ్య కలగజేసుకుని, "నేను చెప్పినట్టు చేశారంటే, మీ ఇద్దరికీ న్యాయం జరిగే అవకాశం ఉన్నది." అన్నాడు.

"సెలవియ్యండి!" అన్నారు ఇద్దరూ.

"మీ రిద్దరూ చెరొక బిందె తీసుకుని, ఒక నెల రోజులపాటు మీ వద్ద ఉంచండి. తరవాత న్యాయంగా తీర్పు చెబుతాం." అన్నాడు గోపయ్య.

ఇద్దరూ చెరొక బిందె ఎత్తుకుని, ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోగానే గ్రామాధికారి తన తమ్ముడి కేసి తిరిగి, "ఇదేం సలహారా? నెల్లాళ్ళ తరవాత వాళ్ళు వస్తే నేనేం తీర్పు చెప్పేది?" అని అడిగాడు.

"నెల గడిచాక వాళ్ళు మన దగ్గిరికి తీర్పుకోసం వస్తేగద?" అన్నాడు గోపయ్య పెద్దగా నవ్వి.

"అదేం? ఎందుకు రారూ?" అన్నాడు గ్రామాధికారి ఆశ్చర్యంతో.

"ఒక్కవారం రోజులు ఓపిక పట్టు. ఎందుకు రారో నువే చూస్తావు." అన్నాడు గోపయ్య.

వారం రోజులు గడిచాయి. ఒకనాటి అర్ధరాత్రి గోపయ్య తన అన్నను వెంట బెట్టుకుని దానయ్య ఇంటి దగ్గిరికి వచ్చి, ఇంటి బయట నిలబడ్డాడు. ఇంట్లో నుంచి దానయ్య మాటలు వినిపించాయి.



"మునపటి ఓపిక లేదు. పనిచెయ్యటం కష్టంగా ఉంటున్నది. పిల్లలేమో ఎదిగి వస్తున్నారు. నిజానికి రెండు బిందెలూ నేనే తీసుకుని ఉండవలసింది. ఆ పొలం నాదే గద. అమ్మక ముందు దొరికితే ఏ చిక్కూ ఉండేది కాదు. కాని ఇప్పుడు రెండో బిందె కూడా ఇప్పించమంటే నలుగురూ నవ్వి పోతారు. ఈ బిందెలో ఉన్న బంగారంతో ఇంత పొలం కొనుక్కొని హాయిగా ఉంటాం. ఇంతకన్న చేసేదిలేదు," అంటున్నాడు దానయ్య.

అక్కడినుంచి గ్రామాధికారీ, గోపయ్యా శీనయ్య ఇంటికి వెళ్ళి చాటుగా నిలిచి ఆలకించారు.

"దానయ్య చెప్పినట్టు విని రెండు బిందెలూ ఉంచేసుకోక పోవటం పొరపాటయింది. పొలం నాది అయాక బిందెలూ నావే కద! వాటిని దానయ్య ఏమన్నా పొలంలో పాతిపెట్టాడా ఏం? కాని ఇప్పుడు గ్రామాధికారి వద్దకు వెళ్ళి ఆ రెండో బిందె కూడా నాకే ఇప్పించమనటం భావ్యంగా ఉండదు. ఈ బిందెతోనే తృప్తి పడాలి. గత్యంతరం లేదు." అంటున్నాడు శీనయ్య.

అన్నదమ్ములు ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు గ్రామాధికారి గోపయ్యతో, "నువు చెప్పిన మాట నిజమే సుమా! వాళ్ళింక మన దగ్గిరికి రారు. ఎంతో నీతి మంతుల లాగా మాట్లాడారు! వాళ్ళ అసలు సంగతి నువు ఎట్లా తెలుసుకున్నావు?" అన్నాడు.

"వాళ్ళ నీతినీ, నిజాయితీనీ నువు తప్పు పట్టకు. నీతి లేనివాడే అయితే దానయ్య ఆ బిందెలను శీనయ్యకు ఇవ్వనే ఇవ్వడు. శీనయ్య కూడా నీతి గలవాడు కనకనే వాటిని నిరాకరించాడు. కాని వారం రోజుల పాటు ధనలక్ష్మి కళ్ళ ఎదట కనిపిస్తూ ఉంటే ఎంతటి నీతి పరుడు కూడా తప్పక మారి తీరుతాడు. అది మానవ స్వభావం. దాన్ని మార్చే శక్తి ధనానికి ఉన్నది," అన్నాడు గోపయ్య.

ఆ రాత్రి దానయ్య చేతా, శీనయ్య చేతా అలా మాట్లాడించిన మనుషులు గోపయ్య నియోగించిన వాళ్ళే!





# దైవ సహాయం

హిమాలయపు దిగువ కొండలలో ఒక లోయ ఉండేది. ఆ లోయలో అనేకవేల ఏళ్ళుగా ఒక కొండజాతి నివసించేది. ఆ జాతివాళ్ళు పశువులను పెంచీ, ధాన్యం పండించీ జీవించే వాళ్ళు. అయితే రాను రాను ఆ లోయలో పంటలు పండించటమూ, పశువులను మేపటమూ కూడా చాలా కష్టమయింది. దానికి కారణమేమంటే, ఏటా కొండల మీదినుంచి చిన్న, పెద్ద బండరాళ్ళు లోయలోకి దొర్లి వచ్చి పడుతూ ఉండేవి. వందలకొద్దీ ఏళ్ళు గడిచేసరికి లోయ దాదాపు అంతా రాళ్ళమయం అయిపోయింది.

దీని ఫలితంగా పంటలు సన్నగిల్లాయి, పశువులు బక్కచిక్కాయి. ఆ లోయలో ఉండటం జాతివాళ్ళకు దుర్భరమయింది. జాతి యువకులు కొందరు తమలో తాము చర్చించుకుని, తమ నాయకుడి వద్దకు వెళ్ళి, "తాతా, మనం చోటు మార్చక పోతే నామరూపాలు లేకుండా పోతాం. కడుపు నిండా తిండి మనకూ లేదు, మన పశువులకూ లేదు. ఈ లోయ వదిలి మరో చోటు చూసుకుందాం," అన్నారు.

వృద్ధ నాయకుడు వాళ్ళకేసి విచారంగా చూసి, "ఈ లోయ అనాదిగా మనదిరా! మన ముత్తాతలూ, వాళ్ళ ముత్తాతలూ ఈ గడ్డలోనే కలిసిపోయారు రా! ఇంకో చోటికి పోతే మన బతుకు మారిపోతుంది, మనం మారిపోతాం," అంటూ తాను చెప్పవలసిన మాటలు చెప్పాడు.

"మన బతుకులు బండలపాలు చేసుకునే కన్న, మార్చుకోవటమే మేలు," అన్నారు జాతి యువకులు.

"ఈ లోయ చచ్చింది. ఇందులో మనం బతకలేం," అన్నారు కొందరు.

"ఈ లోయ చావలేదురా! నేను చూపిస్తా రండి!" అంటూ వృద్ధ నాయకుడు యువ

ఎస్. కుమారస్వామి

కులకు ఒక వెడల్పయిన బండను చూపి, దాన్ని పార్లించమన్నాడు. పదిమంది పట్టి ఆ బండను ఎత్తి పక్కకు తోశారు. దాని కింద నల్లని మట్టి ఉన్నది.

"ఆ మట్టి బంగారం రా! అందులో బంగారం పండుతుంది. రాళ్ళన్నిటి కిందా ఇలాటి మట్టే ఉన్నది," అన్నాడు వృద్ధుడు.

"లోయ నిండా వేలకొద్దీ రాళ్ళున్నాయి. వీటన్నిటినీ ఎట్లా పార్లిస్తాం? ఎక్కడికి దొర్లిస్తాం. నువు మనకోసం ఇంకో చోటు చూడాలిసిందే," అన్నారు యువకులు.

"సరే, మీరన్నట్టే కానివ్వండి. నేను మన గణదేవతను కొలిచి, ఆవిడ ఆజ్ఞ ప్రకారం ఏదో ఒకటి చేస్తాను," అన్నాడు వృద్ధ నాయకుడు.

ఆ మర్నాడే ఆయన తన జాతి వాళ్ళ నందరినీ సభకు రమ్మని పిలిచాడు. ఆడా, మగా, బాలా, వృద్ధా సభకు వచ్చారు.

"గణదేవత నిన్న రాత్రి నాకు కలలో కనిపించి చెప్పింది. మనం ఆ తల్లికి పెద్ద ఆలయం కట్టాలిట. దాని చుట్టూ మనం ఇళ్ళు కట్టుకోవాలిట. అప్పుడు గాని మనకు మంచి రోజులు రావుట!" అన్నాడు వృద్ధుడు.

అందరికీ ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. చిన్నపిల్లల దగ్గరనుంచీ సహాయ పడి ఆలయం కట్టటానికి రాళ్ళు తెచ్చి ఒక చోట చేర్చారు. కొద్ది కాలంలోనే గుడిలేచింది. గర్భగుడి ఆరు నిలువుల ఎత్తున ఉండాలని వృద్ధుడు అన్నాడు. ఆ ఎత్తుకు రాళ్ళు పేర్చి, దానిమీద ఆలయం నిర్మించారు.

తరవాత మరికొన్ని రాళ్ళు తెచ్చి ఆలయం చుట్టూ ఇళ్ళుకట్టారు.

ఈ పనులన్నీ పూర్తి అయేసరికి లోయలో మూడు పంతులు నేల బయట పడింది. అది చాలా సారవంతమైన నేల. అందులో ఏ గింజ నాటినా మొక్క మనిషి ఎత్తు లేచి, కంకులు విరగ కాసింది. మట్టి అంతగా లోతులేనిచోట్ల చక్కని పచ్చిక మొలిచింది.

ఈ విధంగా మనుషులకూ, పశువులకూ ఏనాడూ లేని ఆహారం లభించింది. అబాల గోపాలం చాలా తృప్తి చెంది, తమ గణ దేవతకు కొలుపులు చేసుకున్నారు.





# యక్షపర్వతం

కొన్ని వందల సంవత్సరాల క్రిందట నర్మదానదీ ప్రాంతాన గల అరణ్యాలలో అనేకమైన ఆటవిక జాతి మనుష్యులు నివసిస్తూండే వాళ్ళు. వాళ్ళల్లో ఒక్కొక్క జాతి వాళ్ళకు ఒక నాయకుడో, ఒక రాజో వుండి అందరి మీదా అధికారం చలాయిస్తూండేవాడు. ఈ జాతుల మధ్య ఐకమత్యం లాంటిది లేకపోగా, తరచు ఒకరిపై ఒకరు యుద్ధాలు చేస్తూండే వారు.

ఇలాంటి ఆటవిక జాతుల్లో ఒకటైన ఖడ్గమృగ జాతి వాళ్ళు, అరణ్యంలో గల కొండల్లో అరణ్యాపురం అని ఒక పెద్ద పల్లె నిర్మించుకుని అందులో నివసిస్తూండే వాళ్లు. ఖడ్గమృగాలను మచ్చిక చేసి వాటిని వ్యవసాయప్పనులకూ, వాహనాలుగానూ ఉపయోగించుకుంటున్నందు వల్ల, ఈ అరణ్యాపురంలో వుండే వాళ్ళకు ఖడ్గమృగ జాతి వాళ్ళన్న పేరు కలిగింది.

ఈ ఖడ్గమృగ జాతి వాళ్ళకు కొత్తగా అధికారానికి వచ్చిన అరణ్యామల్లు అనే యువకుడు రాజుగా వుండేవాడు. ఇతణ్ణి అధికారం నుంచి తొలగించేందుకు జాతి వాళ్ళ గణాచారి ఒకడు గట్టి ప్రయత్నాలు చేశాడు. కాని, ఇద్దరు క్షత్రియ యువకుల తోడ్పాటుతో అరణ్యామల్లు, ఆ గణాచారి మోసాన్ని బయట పెట్టించి, అతణ్ణి పులికి మేతగా వేశాడు.

గణాచారి దుర్మరణం తరవాత అరణ్యామల్లు పరిపాలన ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. పూర్వం కేవలం



వేట మీద ఆధారపడి జీవించే ఖడ్గమృగ జాతివాళ్ళు, యిప్పుడు చుట్టుపక్కల వున్న అరణ్య ప్రాంతాల్లో వ్యవసాయపు పనులు ప్రారంభించి, జొన్నలూ, గోధుమలూ లాంటి ఆహార ధాన్యాలను పండించసాగారు.

అరణ్యమల్లు సింహాసనానికి వచ్చి సంవత్సరం పూర్తయింది. ఆరోజున ఖడ్గ జాతి వాళ్ళంతా మహోత్సాహంతో వార్షికోత్సవం ఏర్పాటు చేశారు. యువకులు ఈటే కత్తులు తిప్పటం, ఖడ్గమృగాలను ఎత్తుగా కట్టిన గడకర్రల మీది నుంచి దూకించటం, మల్ల యుద్ధాలు చేయటం లాంటి బల ప్రదర్శనాలతో స్త్రీ, బాల, వృద్ధు లందరినీ వినోదింప చేస్తున్నారు.

అరణ్యమల్లు ఒక ఎత్తయిన ప్రదేశంలో, నగిషీలు చెక్కిన రాతి సింహాసనంలో కూర్చుని యిదంతా చూసి ఎంతగానో ఆనందపడుతున్నాడు.

అలాంటి ఉత్సాహ సమయంలో ఇద్దరు ఖడ్గజాతి వాళ్ళు తమ వాహనాల మీద ఉరుకులూ పరుగులతో ఆ ప్రదేశానికి వచ్చి, వాహనాలు దిగి అడ్డు వచ్చిన జనాన్ని తోసుకుంటూ అరణ్యమల్లు కేసి పోసాగారు.

అరణ్యమల్లుకు శిలాముఖి అనే మంత్రి వున్నాడు. అతను అరణ్యమల్లు కేసి పోతున్న ఆ యిద్దరినీ చూసి దగ్గిరకు రమ్మన్నట్టుగా సౌంజ్ఞ చేసి, వాళ్ళు రాగానే, "ఏమిటి సంగతి? కొంపలంటుకున్నట్టు అలా పరిగెత్తుతారేం! ఈ ఉత్సాహ సమయంలో రాజుగారితో మీకేం పని? మంత్రిని నేను లేనా," అన్నాడు కోపంగా.

శిలాముఖి యిలా అనగానే ఆ ఇద్దరూ అతడికి నమస్కరించి నిలబడి పోయారు.

"సంగతేమిటో చెప్పండి? ఇంతలోనే మూగవాళ్ళయారా?" అన్నాడు శిలాముఖి.

ఆ ప్రశ్న వింటూనే ఆ వచ్చిన వాళ్ళిద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళల్లో కొంచెం పెద్దవాడు గొంతు సవరించుకుని, "అయ్యా, కొండ వాగు పక్కన వున్న మన జొన్నచేల మీద ఎవరో కొత్త వాళ్ళు పడి కంకులన్నీ కోసుకుపోతున్నారు.

వాళ్ళు మనం ఎరిగిన అరణ్యా జాతుల వాళ్ళలా లేరు. వాళ్ళ నెత్తి మీద పెద్ద పెద్ద తల గుడ్డలున్నవి. శరీరాన్నంతా కప్పుతూ వస్త్రాలు ధరించి వున్నారు. అన్నిటికన్నా వింత, ఈ పరిసరాల్లో ఎక్కడా కనబడని కొత్త రకం జంతువులను వెంట తోలుకు వచ్చారు. వాటి మీదే కోసిన జొన్నకంకులు వేస్తున్నారు," అన్నాడు.

"ఏమిటా కొత్త రకం జంతువులు ?" అన్నాడు మంత్రి శిలాముఖి.

"అవి ఏనుగులంత ఎత్తున్నాయి. పుల్ల ల్లాంటి కాళ్ళు, మెడలు కొంగ మెడల్లా వంకర తిరిగి వున్నాయి. నడుం మీద ఎత్త యిన మూపురం వున్నది," అన్నాడు వచ్చిన వాళ్ళల్లో చిన్నవాడు.

మంత్రీ వాళ్ళూ యిలా సంభాషిస్తూం డగా అదేమిటో వినేందుకు చుట్టూ కొందరు ఖడ్గజాతి వాళ్ళు చేరారు. ఆ వింత జంతు వుల వర్ణన వినగానే వాళ్ళల్లో కొందరికి హడలెత్తి పోయింది. వాళ్ళు జనంలోకి పరిగెత్తుతూ, "ఏవో వింత మృగాల మీద వచ్చిన మరొక లోకం వాళ్ళు మన పండిన పంటలు కోసుకు పోతున్నారు," అంటూ కేకలు పెట్టారు.

వినోదాలు చూస్తున్న జనంలో కలకలం బయలుదేరింది. అది చూసి రాజు అరణ్యా మల్లు సింహాసనం మీది నుంచి లేచి,



"ఏమిటా గొడవ? ఏం జరిగింది ? మంత్రి శిలాముఖి ఎక్కడ ?" అన్నాడు బిగ్గరగా.

శిలాముఖి ఆ వింత జంతువులను చూసి వచ్చిన వాళ్ళద్దర్నీ అరణ్యామల్లు దగ్గిరకు తీసుకుపోయి, వాళ్ళ ద్వారా తాను విన్న దంతా అతడికి చెప్పాడు.

"మనం కష్టపడి పండించిన పంటలు బందిపోట్లు దోచుకు పోతుంటే, వాళ్ళను పట్టుకునేందుకు ఆయుధాలు తీసుకుని బయలుదేరక, వింత జంతువులను గురించి ఆశ్చర్య పడుతున్నారా? పేరుకు నేను రాజును, నా కొక మంత్రి! కాని, మన ప్రవర్తన మాత్రం ఆటవిక మూక ధోరణి లోనే వున్నది. దీనికి ఒక రాజ్యం అన్న



"పేరెందుకో తెలియటం లేదు," అన్నాడు అరణ్యమల్లు కోపంగా.

అరణ్యమల్లు యిలా అనగానే శిలాముఖి జనం కేసి తిరిగి, "ప్రస్తుతానికి యీ వినోదాలు కట్టి పెట్టండి. మన పొలాల్లోని పంటల్ని బందిపోట్లు దోచుకు పోతున్నారు. వాళ్ళను హతమార్చి మన పంటల్ని కాపాడుకోవాలి," అన్నాడు పెద్ద గొంతుతో.

ఆ వెంటనే అనేక మంది ఖడ్గజాతి వాళ్ళు ఈటెలూ, కత్తులూ తీసుకుని బయలు దేరారు. కొందరు ఖడ్గమృగాల మీద సవారీ అయారు. ఒక అనుచరుడు తెచ్చిన ఖడ్గమృగాన్ని ఎక్కి మంత్రి శిలాముఖి ముందుగా బయలుదేరాడు.

రాజు అరణ్యమల్లు వాళ్ళను ఉత్సాహపరుస్తూ, "ఆ బందిపోట్లెక్కి వచ్చిన వింత మృగాలను చూసి భయపడకండి. లోకంలో మనం వాహనాలుగా ఉపయోగించే ఖడ్గమృగాల కన్న భీతి గొల్పేవి మరెక్కడా లేవు. ఆ బందిపోట్లలో కొందరిని ఖైదీలుగా పట్టుకు రండి. వాళ్ళ ద్వారా ఆ దుర్మార్గుల గుట్టుమట్లు తెలుసుకోవచ్చు," అన్నాడు.

"జై, అరణ్యమాతకూ! జై, అరణ్యమల్లు మహారాజుకూ!" అంటూ ఖడ్గజాతి వాళ్ళు కొండ వాగు కేసి పరుగులు తీశారు.

వాళ్ళు వాగు ప్రాంతాల గల తమ పంట పొలాలను సమీపించేంతలో అక్కడ కనిపించిన దృశ్యం అందర్నీ హడలగొట్టింది. బందిపోట్లు పాతికా ముప్ఫైమంది వున్నారు. వాళ్ళల్లో కొందరు జొన్నకంకులు కోస్తున్నారు. ఆ కోసిన వాటిని కొందరు వికృతంగా వున్న మృగాల మీద గల పెద్ద సంచుల్లో పెడుతున్నారు. నలుగురైదుగురు బందిపోట్లు పొడవాటి ఈటెలతో చేల చుట్టూ పహరా తిరుగుతున్నట్టు, తమ వాహనాలను అటూ యిటూ పరిగెత్తిస్తున్నారు.

బందిపోట్లనూ, వాళ్ళ వెంట వున్న వికృత మృగాలనూ చూసి ఖడ్గజాతి వాళ్ళే ఎంతగా భయపడ్డారో అంతకన్న మిన్నగా బందిపోట్లు ఖడ్గమృగాల మీద ఎక్కి వున్న వాళ్ళను చూసి భయపడిపోయారు.

బందిపోట్లలో వికృత మృగం మీద ఎక్కి వున్న వాడొకడు తన చేతిలోని ఈటెను పైకెత్తి పెద్దగా, "ఈ వస్తున్న భయంకర జంతువుల్నీ, వాటి మీద ఎక్కి వున్న ఆటవికుల్నీ చూడండి! ఖడ్గమృగాలను మచ్చిక చేసి వాహనాలుగా ఉపయోగించే వాళ్ళు ఎంతటి మహా సాహసులై వుంటారు!" అన్నాడు.

తమ అనుచరుడు చేసిన హెచ్చరిక వింటూనే ఎవరి పనుల్లో వారు మునిగి వున్న బందిపోటు వాళ్ళందరూ తల లెత్తి చూశారు. . వాళ్ళకు ఖడ్గమృగం మీద ముందు వస్తున్న మంత్రి శిలాముఖి, అతడికి కొంచెం వెనకగా వస్తున్న యితర ఖడ్గజాతి వాళ్ళూ కనిపించారు. అందరి కన్న చాలా వెనకగా కాలి నడకన వచ్చిన ఖడ్గజాతి వాళ్ళు దూరంగా నిలబడి భయకంపిత నేత్రాలతో బందిపోట్ల కేసి చూస్తున్నారు.

బందిపోట్ల నాయకుడు గబగబా ఒక వింత జంతువును ఎక్కి, ఖడ్గజాతివాళ్ళ కేసి పరీక్షగా చూశాడు. వాళ్ళ వాలకం చూస్తే తమ మీదికి వచ్చి పడేందుకు తటపటా యిస్తున్నట్టు అతడికి కనిపించింది. ఖడ్గమృగజాతి వాళ్ళల్లో ఒక్కడూ చొరవగా తమ కేసి వాహనాన్ని దూకించటం లేదు.

"ఒరే, ఉష్ట్రవీరుల్లారా! మన కొచ్చిన భయం ఏమీలేదు. ఈ ఖడ్గమృగం వాళ్ళు మనను చూసి బెంబేలు పడిపోతున్నట్టున్నది. చూడండి, ఒక్కడైనా సాహసించి మన మీదికి కసిగా, వేగంగా వస్తున్నా





డేమో! అందరూ బెదురుకుని తటపటాయిస్తున్నారు. ఇదే మంచి అదను. నా వెంట మరి నలుగురైదుగురు రండి. వాళ్ళను చుట్టు ముట్టి ఈటెలు విసిరి చెల్లాచెదురు చేద్దాం," అన్నాడు బందిపోట్ల నాయకుడు.

నాయకుడు చేసిన హెచ్చరిక వింటూనే నలుగురు బందిపోట్లు తమ వాహనాల మీద ఎక్కి, ఈటెలు ఝళిపిస్తూ ఖడ్గజాతి వాళ్ళ కేసి బయలుదేరారు. అది చూస్తూనే మంత్రి శిలాముఖి భయంతో వణికిపోతూ తన అనుచరుల కేసి తల తిప్పి, "ఈ బందిపోట్లు అంత ఎత్తు జంతువుల మీద వుండి మనను తేలిగ్గా తమ ఈటెలతో పొడవగలరు. మనం వెంటనే వెనుదిరిగి సమీపంలో వున్న చెట్ల కేసి పోదాం. మనను బందిపోట్లు తప్పక తరుముకుంటూ వస్తారు. అప్పుడు చెట్లకొమ్మల్లో వున్న మన వాళ్ళు, వాళ్ళను తేలిగ్గా ఈటెలతో పొడవవచ్చు. మన వెంట వచ్చిన వాళ్ళను చెట్లెక్క మనండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

శిలాముఖి తన అనుచరులకు ఈ హెచ్చరిక చాలా ఆలశ్యంగా చేశాడు. తమ మంత్రి అన్న మాటలు వింటూనే ఇద్దరు ఖడ్గజాతి వాళ్ళు తాము ఎక్కి వున్న మృగాలను వెనక్కు తిప్పి, "కాలి నడకన వచ్చిన వాళ్ళంతా చెట్లెక్కి, బందిపోట్లు వాటి కిందికి రాగానే ఈటెలతో పొడవండి!" అంటూ కేకలు పెట్టారు.

ఖడ్గజాతివాళ్ళల్లో కొందరు చెట్లెక్క సాగారు. వాళ్ళ ఎత్తుగడ గ్రహించిన బందిపోటు నాయకుడు, "ఒరే, మిత్రులారా! ఆ జొన్నకంకులు కోయటం ఆపి అందరూ వాహనాలెక్కండి. నేనూ, మరికొందరం ఈ ఖడ్గమృగాల మీద వున్న వాళ్ల అంతు చూస్తాం. మిగతా వాళ్ళు ఆ చెట్లెక్కే ముఠాను ఈటెలతో పొడిచి కింద పడవేయండి," అని హెచ్చరించాడు.

శిలాముఖి తను ఎక్కి వున్న ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పేలోపలే, బందిపోటు నాయకుడూ, అతడి అనుచరులు కొందరూ వేగంగా వచ్చి, అతణ్ణీ అతడి వెంట వున్న

వాళ్ళనూ చుట్టు ముట్టారు. శిలాముఖి ధైర్యంగా బందిపోటు నాయకుడి ఈటె దెబ్బలను తన ఈటెతో కాచుకుంటూ, "జై అరణ్యమాతా! 'అందరూ చెట్ల కేసి ఖడ్గమృగాలను పరిగెత్తించండి!" అంటూ అరిచాడు.

ఖడ్గమృగాల మీద వున్న వాళ్ళందరూ ఒక్కసారిగా అరణ్యమాతకూ జై, అంటూ కేకలు వేసి వేగంగా చెట్ల కేసి పరిగెత్తసాగారు. శిలాముఖి వాళ్ళందరి కన్న వెనక పడిపోయినా, ఉపాయంగా బందిపోటు నాయకుడి ఈటె దెబ్బల నుంచి తప్పుకుంటూ, "చెట్ల మీద వున్న వాళ్ళు గురి చూసి బందిపోట్ల గుండెల్లో గుచ్చుకునేట్టు ఈటెలు విసరండి!" అంటూ అరిచాడు.

శిలాముఖి తన ప్రాణరక్షణా ప్రయత్నంలో కిందు మీదైపోతూ, యింతసేపూ చెట్ల ప్రాంతాన జరుగుతున్న దేమిటో గమనించ లేదు. అక్కడ చెట్లెక్కబోతున్న ఖడ్గజాతి వాళ్ళ మీదికి కొందరు బందిపోట్లు పోయి, వాళ్ళను ఈటెలతో కొట్టసాగారు. గాయ పడిన వాళ్ళు కింద పడిపోగా, మిగిలిన ఖడ్గ జాతి వాళ్ళు చావు కేకలు పెడుతూ అరణ్యపురం కేసి పరిగెత్తసాగారు.

శిలాముఖి కూడా ఎలాగో ప్రాణరక్షణ చేసుకుంటూ, వెనక తరుముకు వస్తున్న బందిపోట్లకు దొరకకుండా తన అనుచరులతో చెట్ల కేసి పారిపోగలిగాడు. కాని, అక్కడ మరికొందరు బందిపోట్లు తమ వాహనాలతో అతణ్ణి చుట్టు ముట్టే ప్రయత్నం



చేశారు. పరిస్థితి విషమిస్తున్నదని గ్రహిం చిన శిలాముఖి, "ఇక మనం ఈ బంది పోట్లను ఎదిరించలేం. అరణ్యపురం కేసి పారిపోవటమే క్షేమం!" అని తన అను చరులను హెచ్చరించాడు.

ఆ సమయంలో దాపుల నున్న ఒక చెట్టు కొమ్మల్లోంచి, "మహామంత్రి శిలాముఖీ! పారిపోకు. నీ ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పి, దానిచేత నీ వెనక వస్తున్న ఒంటెను కుమ్మించు. నీ ఖడ్గమృగం కొమ్ము వాడి, ఇంద్రుడి వజ్రాయుధం పదునుకు ఏ మాత్రం తీసిపోదు!" అన్న మాటలు వినిపించాయి.

శిలాముఖి ఆ మాటలు స్పష్టంగా విన్నాడు. స్వరాన్ని బట్టి ఆ మాట్లాడింది తా నెరిగిన క్షత్రియ యువకుల వెంట వుండే స్వర్ణా చారి అనే వాడిదని కూడా గుర్తించాడు. కాని, అతడిలో నిలబడి బందిపోట్లను ఎది రించే ధైర్యం పూర్తిగా నీరు కారిపోయింది. ఆ కారణం వల్ల ఖడ్గమృగాన్ని మరి కాస్త గట్టిగా అదిలించి, తన అనుచరుల వెనగ్గా అరణ్యపురం కేసి పారిపోసాగాడు.

శిలాముఖితోపాటు, స్వర్ణాచారి చేసిన హెచ్చరికను బందిపోట్ల నాయకుడు విన్నాడు. అతడు ఎక్కడలేని ఆగ్రహంతో స్వర్ణాచారి ఎక్కి వున్న చెట్టు కిందికి పోయి, "ఎవడ్రా అక్కడ? నా శత్రువులకు ఉపా యాలు చెపుతున్నావా? నే నెవర్నో తెలుసా?" అంటూ హుంకరించాడు.

"నా పేరు స్వర్ణాచారి, పద్మపురవాస్తు శాస్త్రజ్ఞుణ్ణి. పుట్టు పిరికి జీవి ఒంటెను చూసి, మహా పౌరుష ప్రాణి అయిన ఖడ్గ మృగం పారిపోవటం చూసి మెచ్చలేక శిలా ముఖికి అలాంటి సలహా యిచ్చాను. నాకు మీ ఒంటెజాతివాళ్ళూ, ఆ ఖడ్గమృగజాతి వాళ్ళూ — అంతా మిత్రులే!" అన్నాడు స్వర్ణాచారి కొమ్మల్లోనే వుండి.

"ఓహో, చాలా అతి తెలివిగా మాట్లాడు తున్నావే! వెంటనే చెట్టు దిగి వస్తావా లేక గురి చూసి ఈటె విసరమంటావా?" అంటూ బందిపోట్ల నాయకుడు ఒంటె మీద లేచి నిలబడి ఈటె పై కెత్తాడు.

—(ఇంకా వుంది)





# తారుమారు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ దీక్ష చూస్తే ఒక పక్క అద్భుతంగా తోచినప్పటికీ, మరొక వంక, ఈ దీక్ష ఆకస్మికంగా సడలిపోతుందేమోనన్న అనుమానం కలుగుతుంది. దేవుడి యందు ఎంతో దృఢ భక్తి గల వీణావంతుడు ఒక్కక్షణంలో నాస్తికుడయిపోయాడు గద! నీకు శ్రమ తెలియకుండా అతని కథ చెబుతాను, విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

కళింగదేశంలో వీణావంతుడు వైద్యం చేసుకుంటూ ఉండేవాడు. అతను ఎన్నో అద్భుత చికిత్సలు చేసి, అపర ధన్వంతరి అనిపించుకున్నాడు. అతను పరమ శివ భక్తుడు. అతను శివాలయంలోనే ఎప్పుడూ

బేతాళ కథలు

ఉండేవాడు. పగలయేది, రాత్రి అయేది, అతనితో పని ఉన్నవాళ్ళు శివాలయానికి వెళ్ళితే తప్పక దొరికేవాడు.

వీణావంతుడికి ఇల్లూ, వాకిలీ, భార్యా, బిడ్డలూ లేకపోలేదు. కాని అతను ఆ ఇంటికి ఎప్పుడో చుట్టపు చూపుగా మాత్రమే వెళ్ళేవాడు. అతనికి సంసార తాపత్రయం ఏనాడూ లేదు. ఒకప్పుడు అతను ఒక ధనికుడికి చికిత్స చేసి, మృత్యుముఖం నుంచి బయటికి లాగాడు. ఆ ధనికుడు కృతజ్ఞతతో అతనికి తన కూతురైన యశోధరను ఇచ్చి పెళ్ళి చేసి, వాళ్ళు ఉండటానికి ఒక ఇల్లు కూడా కట్టించి ఇచ్చాడు.

వీణావంతుడికి భార్య పట్ల ప్రేమ లేకపోలేదు. ఆమెకు పిల్లలను కూడా కన్నాడు. కాని సంసారం మీదపడినా అతని అసలు ప్రవృత్తి మారలేదు. అస్తమానమూ శివాలయంలో కూర్చునేవాడు. అక్కడే రోగులను చూసేవాడు. డబ్బు సంపాదించేవాడు. కాని ఆ డబ్బు ఇంటికి చేరేదికాదు. శివాలయంలో కనిపించిన పేద శివభక్తులకు దానంగా వెళ్ళిపోయేది. వైద్యంతో తీరక అతను రోజుల తరబడి ఇంటి ముఖం చూసేవాడు కాడు, భార్య డబ్బులు కావాలని కబురు చేస్తే తన వద్ద మిగిలి ఉన్న కొద్ది డబ్బులు ఇచ్చి పంపేవాడు.

యశోధర అభిమానవతి. భర్త సహాయం లేకుండా తాను ఒంటరిగా సంసారమూ, పిల్లల సంరక్షణా చూసుకోవటంతో ప్రాణం విసిగిపోయి, ఆమె ఒకనాడు తన ఇంటిని



యశోవంతు డనే ధనికుడికి అమ్మేసి, పిల్ల లతో సహా పుట్టింటికి వెళ్ళిపోయింది. చిత్ర మేమిటంటే తన భార్య ఈ పని చెయ్యటం వీణావంతుడికి చీమ కుట్టినట్టయినా లేదు.

యశోధర నుంచి ఇల్లు కొన్న యశోవం తుడు పరమ నాస్తికుడు. దేవుడి పేరు తెస్తే చిరాకు పడేవాడు. ఏ దేవుడికీ దణ్ణం పెట్టకుండానే అయన కోట్లు అర్జించాడు. వైద్యంలో వీణావంతుడి హస్తవాసి ఎటు వంటిదో, వ్యాపారంలో యశోవంతుడి హస్త వాసి కూడా అటువంటిదే. అయన మట్టి పట్టితే బంగారమయేది.

యశోవంతుడి భార్యలు ఇద్దరు సంతానం లేకుండా ఒకరి తరవాత ఒకరు పోయారు. ఆయన మూడో భార్య గర్భవతి అయింది. యశోవంతుడి ఆనందానికి మేరలేదు. తాను గర్భవతి కావటం దేవుడి అనుగ్రహం వల్లనే అని భార్య అనేసరికి, "నువు అలా అనుకో దలిస్తే అనుకో. నేను మాత్రం దేవుడి దయ అని నమ్మను," అన్నాడాయన.

యశోవంతుడి భార్య తొమ్మిది నెలలూ మోసి మగ బిడ్డను కన్నది. కాని అది బిడ్డ కాదు, శవం! తోలు కప్పిన ఎముకల గూడు. ఆ బిడ్డలో చలనం లేదు. అయితే గుండె కొట్టుకుంటూనే ఉన్నది.

"ఈ బిడ్డను వీణావంతుడు బతికిస్తే బతికించాలి. మరొకడి వల్ల కాదు," అన్నారు యశోవంతుడి బంధువులు.

వీణావంతు డంటే యశోవంతుడికి చాలా హీనమైన అభిప్రాయం ఉన్నది. అతను





దైవ మూఢుడు! సంసారాన్ని చూసుకోలేని అసమర్థుడు!

ఇలాటి అభిప్రాయం ఉన్నప్పటికీ యశోవంతుడు, తనకు లేక లేక పుట్టిన బిడ్డ బతుకుతాడేమోనన్న ఆశ కొద్దీ, "అలా అయితే అతన్ని పిలుచుకు రండి!" అని తన వారితో అన్నాడు.

మనుషులు శివాలయానికి వెళ్ళి, వీణావంతుడితో సంగతి చెప్పి, అతన్ని తమ వెంట రమ్మన్నారు.

"ఆ నాస్తికుడి వద్దకు నేను రాను. అతడు అలయానికి వచ్చి శివలింగం ముందు సాష్టాంగపడి అపరాధం చెప్పుకుంటే, అతడి బిడ్డకు చికిత్స చేస్తాను. ఆ తరవాత అంతా పరమశివుడి దయ!" అన్నాడు వీణావంతుడు.

యశోవంతుడు తన బిడ్డను తీసుకుని శివాలయానికి వెళ్ళి, బిడ్డను వీణావంతుడి ముందు పెట్టి, శివలింగం ముందు సాష్టాంగపడి లేచి, చెంపలు వేసుకున్నాడు. ఆయన ఇదంతా చేసింది వీణావంతుడి తృప్తి కోసమే గాని, తనకు దేవుడి యందు నమ్మకం కుదిరి కాదు.

వీణావంతుడు తన సంచి కట్టు నుంచి ఏదో గుళిక తీసి, రంగరించి బిడ్డ నోటికి రాచాడు. వెంటనే బిడ్డ కదిలి కెవ్వున ఏడవనారంభించాడు. ఈ వింత చూడవచ్చిన వారంతా అంతులేని ఆశ్చర్యం చెందారు.

అదే క్షణంలో యశోధర పెద్ద పెట్టున ఏడుస్తూ తన ఆఖరు బిడ్డను భుజం మీద వేసుకుని వచ్చి, "నా బిడ్డను కాపాడండి," అంటూ స్పృహ లేకుండా ఉన్న బిడ్డను తన భర్త ముందు ఉంచింది.

వీణావంతుడు బిడ్డ నాడి పరీక్షించి, బిడ్డ నోటిలో ఒక మాత్ర వేశాడు. ఆ బిడ్డ ఒక్కసారి కళ్ళు తెరిచి, తల్లి వంక చూసి, ప్రాణం వదిలాడు.

యశోవంతుడు చప్పున శివలింగం ముందు సాగిలబడి, ఆ బిడ్డ ప్రాణాలు కాపాడమని దీనంగా బతిమాలుకున్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

వీణావంతుడు తన మందుల సంచిని లింగం మీద విసిరికొట్టి, ఎటో వెళ్ళి పోయాడు. తిరిగి అతను గుడి ఆవరణలోకి మళ్ళీ అడుగు పెట్టలేదు. తరవాత ఒక ఉత్సవంనాడు దేవుడి ఊరేగింపు జరుగు తూండగా అతను వీధి పక్కన నిలబడి దేవుడి విగ్రహం మీద రాళ్ళు విసిరే సరికి, అతనికి పిచ్చి పట్టిందని అందరూ అను కున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పరమభక్తుడైన వీణావంతుడు ఉన్నట్టుండి నాస్తికుడు కావటానికీ, పరమ నాస్తికుడైన యశోవంతుడికి భగవంతుడిలో విశ్వాసం కలగటానికీ కారణమేమిటి? మనుషులు భగవంతుణ్ణి నమ్మటం కేవలమూ స్వార్థంతో నేనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనిషి స్వార్థం లేకుండా ఏదీ నమ్మడు. యశోవంతుడు తన కొడుకు బతికాడుగదా అని దేవుడిలో నమ్మకం తెచ్చుకున్నాడు. అలాటి స్వార్థం తోనే వీణావంతుడు కూడా దేవుణ్ణి నమ్ముతూ వచ్చాడు. అతనికి తన వైద్యంలో ఏనాడూ నమ్మకంలేదు. తాను నిమిత్తమాత్రంగా చికి త్సలు చేస్తూంటే శివానుగ్రహం వల్ల రోగు లకు నయమవుతున్నదని అతను భ్రమ పడుతూ రావటమే అతను చేసిన పొరపాటు. ఇలాటి స్వార్థం ఆధారంగా ఉండబట్టే, తన కొడుకు చనిపోయేసరికి ఆ విశ్వాసం కాస్తా పోయింది. తన కొడుకు బతకక పోవడానికి కారణం తాను సరి అయిన చికిత్స చెయ్యలేక పోవటమేనని గ్రహించక, తప్పు దేవుడి పైన తోశాడు. ఇలా దేవుణ్ణి తన వైద్యానికి అడ్డు పెట్టుకుని మూఢుడు కావటం చేత అతను వెర్రివాడై పోయి, లోకానికి వైద్యుడుగా తాను చేయ గల ఉపకారాన్ని గంగపాలు చేసేశాడు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఉత్తమలోక ప్రాప్తి

త్రిలోక సంచారి అయిన నారదుడు ఒకప్పుడు భూలోకంలో ఒక శ్మశానం మీదుగా పోతూ ఉండగా ఆయనకు ఒక పుర్రె కనిపించింది. తన తండ్రిగారి దస్తూరీ తెలిసినవాడు కావటం చేత ఆ పుర్రె మీద "ఊర్ధ్వలోక ప్రాప్తి" అని రాసి ఉండటం నారదుడు గమనించాడు.

నారదుడు దివ్యదృష్టితో చూస్తే ఆ పుర్రె ఒక గర్భదరిద్రుడిది. బతికినన్నాళ్ళూ దారిద్ర్యబాధ అనుభవించిన ఆ దరిద్రుడు ఒక దానం గాని, ధర్మం గాని చెయ్యలేదు; గుళ్ళూ గోపురాలూ కట్టించలేదు. అలాటి వాడికి ఊర్ధ్వలోకాలు ఎలా వచ్చాయి? బ్రహ్మదేవుడు ఇంత తప్పుగా ఎలా రాశాడు?

ఈ సంగతి తేల్చుకునేందుకు నారదుడు ఆ పుర్రెను తీసుకుని బ్రహ్మలోకానికి వెళ్ళి, "నాన్నగారూ, ఈ గర్భదరిద్రుడు ఎలాటి పుణ్యకార్యాలూ చెయ్యలేదు గదా వీడి తల మీద ఊర్ధ్వలోక ప్రాప్తి కలిగేటట్టు అబద్ధం ఎందుకు రాశారు?" అని అడిగాడు.

"అబద్ధం ఎలా అయిందిరా, నాయనా? ఈ పుర్రెను ఈ లోకానికి నువే స్వయంగా తెస్తివి గదా!" అన్నాడు బ్రహ్మ.

—డి. మహేశ్





# మహా శిల్పి

ఒక గ్రామంలో కొన్నివేల ఏళ్ళ క్రితం ఒక మహా శిల్పి ఉండేవాడు. అతని చేతి మీదుగా ఎన్నో చిత్ర విచిత్ర భవనాలూ, సభలూ, ఆలయాలూ నిర్మించాడు. అతని ఖ్యాతి దేశదేశాలా వ్యాపించింది.

ఆ కాలంలో నాగలోకంలో నాగరాజు భవనం ఉపద్రవమైన భూకంపాల ఫలితంగా బీటలు విచ్చింది. దాన్ని తిరిగి నిర్మించటానికి భూలోకం నుంచి మహా శిల్పిని రప్పించాలని నాగరాజు నిశ్చయించాడు. అతడి కబురు చేరగానే శిల్పి పరమానందం చెంది, తాను మరొక్క గొప్ప భవనం నిర్మించవచ్చును గదా అనుకుని నాగలోకానికి వెళ్ళాడు.

త్వరలోనే శిల్పికీ, నాగరాజుకూ మంచి స్నేహం కలిసింది. నాగరాజు కుటుంబమూ, పరివారమూ అతనికి ఆప్తులయారు. అతనికి అన్న పానాలకు ఎలాటి లోటూ జరగలేదు. అయినా శిల్పికి తన ఇంటి మీద గాలి మళ్ళింది. అంతులేని వైభవం మధ్యా, సంపద మధ్యా ఉంటూ కూడా అతను తన పేద ఇంటిని గురించీ, తన తల్లిని గురించీ, భార్యను గురించీ బెంగపడసాగాడు.

ఒకనాడు శిల్పి నాగరాజుతో, "రాజా, నాకీ మధ్య మా ఇంటి మీద ధ్యాస జాస్తిగా ఉంటుస్నది. మా ఊరి పరిస్థితులు కాస్త కనుక్కొని నాకు చెబుతావా?" అని అడిగాడు.

"నిజం దాచటం దేనికి? మీ ఊరి ప్రాంతాల కొంతకాలంగా వానలు లేవు. అక్కడ భయంకర క్షామం ఉన్నది." అన్నాడు నాగరాజు.

"అలా అయితే అక్కడ వానలు కురిపించలేవా?" అన్నాడు శిల్పి.

"అది ఎంత మాత్రమూ కుదరదు. అలా వానలు కురిపించటం నియమ విరుద్ధం.

వి. చక్రధరరావు



ఎక్కడ ఎప్పుడు క్షామం రావలిసింది ముందుగానే నిర్ణయమవుతుంది. ఈ కాటకం ఇంకా తొంభైతొమ్మిది రోజులుంటుంది,'' అన్నాడు నాగరాజు.

శిల్పికి కంపరం పుట్టుకొచ్చింది. అతని మనసులో తన గ్రామమూ, తన తల్లీ, భార్యా, తన బంధువులూ, మిత్రులూ, తిండికి అల్లాడుతూ కనిపించారు. వాళ్ళు తిండి లేక, నీరు లేక, ఆకులూ అలములూ పీక్కు తింటూ, క్రమంగా చచ్చిపోతూ ఉండటం అతను ఊహించుకున్నాడు.

''నాగరాజా, నిన్ను వేడుకుంటున్నాను. నా గ్రామానికి వాన పంపించు. నా వాళ్ళందరూ నీటి కోసం తల్లడిల్లి పోతున్నారు. వాళ్ళు దిక్కులేని చావు చస్తారు!'' అన్నాడు శిల్పి ఉద్రేకంతో.

''అమాయకుడా! వాళ్ళ గొడవ నీకు దేనికి? నా భవనం పని పూర్తి కాగానే నీకు గొప్ప బహుమతి ఇస్తాను. నీకు అంతులేని మణులూ, బంగారమూ, వెండీ ఇస్తాను. నువు బతికి ఉన్నన్నాళ్ళూ మహారాజులా బతుకు,'' అన్నాడు నాగరాజు.

''నాకు వానే కావాలి! మా గ్రామంలో అందరికీ వాన కావాలి. నీ వాళ్ళే మలమలా మాడిపోతూ ఉంటే నువ్విలా నిశ్చింతగా ఉండగలుగుతావా?'' అన్నాడు శిల్పి.

''నన్ను అనవసరంగా విసిగించకు! ఇప్పట్లో వాన లేదు. అది అంతే!'' అంటూ నాగరాజు లేచిపోయాడు.

శిల్పి వెళ్ళిపోవటానికి తన పనిముట్లూ అవీ సర్దుకోసాగాడు.

ఈ సంగతి విని నాగరాజు శిల్పి వద్దకు వచ్చి, ''నిష్కారణంగా ఏమిటి నీ అలక?'' అన్నాడు.

''లేదు, నాగరాజా! నేను మా ఊరు వెళ్ళి అక్కడి పరిస్థితి ఏమిటో తెలుసుకోవాలి,'' అన్నాడు శిల్పి.

''ఎవర్రా అక్కడ? ఈ దుర్మార్గుణ్ణి బంధించండి,'' అని నాగరాజు తన సేవకులను కేక పెట్టాడు. క్షణంలో నాగ సేవకులు వచ్చి శిల్పిని చుట్టుముట్టారు.

"ఇప్పుడు చెప్పు. నా భవనం మరమ్మత్తు పూర్తి చేస్తావా, లేదా?" అని నాగరాజు అడిగాడు.

"మా గ్రామంలో వర్షం కురిపిస్తావా, లేదా?" అని శిల్పి ఎదురు ప్రశ్న వేశాడు.

"కురిపించనని నీకు ముందే చెప్పాను," అన్నాడు నాగరాజు.

"అలా అయినప్పుడు నేను నీ పని పూర్తి చెయ్యను," అన్నాడు శిల్పి.

"వీణ్ణి తీసుకుపోయి, తల —" అంటూ నాగరాజు ఆగాడు. శిల్పి తల నరికేస్తే భవనం మరమ్మతులు ఆగిపోతాయన్నది జ్ఞాపకం వచ్చి, వెంటనే ఆయన, "శిల్పిని వదిలెయ్యండి!" అన్నాడు నిట్టూర్చి.

ఇందువల్ల శిల్పి పరిస్థితి మెరుగైనదేమీ లేదు. అతన్ని నాగలోకం నుంచి వెళ్ళిపోనివ్వరు. తన గ్రామమేమో కాటకంలోనే ఉన్నది. శిల్పి ఒక చోట కూర్చుని, ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ ఉండగా అతని దృష్టి ఒక స్తంభం పైన పడింది.

శిల్పి వెంటనే లేచి ఆ స్తంభాన్ని రంపంతో కోయసాగాడు. స్తంభం తెగిపోతున్న కొద్దీ భవనం మొత్తంగా కంపించసాగింది. నాగరాజు లబలబలాడుతూ వచ్చి, "ఆపు! నీకు పుణ్యం ఉంటుంది, ఆపు!" అని అరిచాడు.

"వాన కురిపిస్తావా మరి?" అని శిల్పి అడిగాడు.




"కురిపిస్తాను. కురిపిస్తాను," అన్నాడు నాగరాజు.

"హాస్యాలకు పోయి వరదలు తెప్పించేవు. మా గ్రామానికి కావలసినంత వానే కురిపించాలి, గుర్తుంచుకో!" అన్నాడు శిల్పి.

"నువు కోరినట్టే చేస్తాను," అన్నాడు నాగరాజు. భవనాలు కట్టగల వాడికి భవనాలు కూల్చటం ఒక బ్రహ్మ విద్య కాదు.

"నువు వాన కురిపించాలే గాని నీ భవనాన్ని చూసి ఇంద్రుడు అసూయపడేటట్టు చెయ్యగలను," అన్నాడు శిల్పి.

నాగరాజు శిల్పికి తనపై బట్ట కప్పి, "నువు మీ గ్రామానికి వెళ్ళి అక్కడ వర్షం పడటం కళ్లారా చూసిరా!" అన్నాడు.

శిల్పి భూలోకానికి వచ్చాడు. అతను తన గ్రామంలో వర్షం పడటమూ, గ్రామస్థులంతా ఆనందపారవశ్యంలో కేకలు పెడుతూ ఉండటమూ కళ్ళారా చూశాడు. కాని గ్రామస్థులు అతన్ని చూడలేదు. వాళ్ళకు కనిపించినది ఒక మహాసర్పం.

"అమ్మో! ఎంత పెద్ద సర్పమో!" అన్నారు గ్రామస్థులు.

"ఇదే మనకు వర్షం తెచ్చింది. దీనికి గుడి కట్టుదాం!" అన్నారు. త్వరలోనే గుడి పూర్తి అయింది. గ్రామానికి కరువు కూడా పోయింది.

శిల్పి నాగలోకానికి తిరిగి వెళ్ళి నాగరాజుతో, "నన్ను మోసం చేసి నాగ రూపంలో పంపావు. నా వారి నందరినీ చూశాను. కాని వారితో మాట్లాడలేక పోయాను," అన్నాడు.

"నువు మహా పెంకె మనిషివి! అందుచేత నా జాగర్త నేను పడ్డాను. నా మాట నేను నిలబెట్టుకున్నాను. నీ పని నువు పూర్తి చెయ్యి," అన్నాడు నాగరాజు.

శిల్పి నాగరాజు భవనాన్ని అద్భుతంగా తయారు చేశాడు. ఇంద్రుడు గృహ ప్రవేశానికి వచ్చి, ఆ భవనాన్ని చూసి నిజంగానే అసూయపడ్డాడు. శిల్పికి నాగరాజు అంతులేని బహుమానాలిచ్చి ఇంటికి పంపేశాడు.

అతన్ని ఎరిగినవాళ్ళు, "ఇంతకాలం ఏమయావు? నువు లేనప్పుడు ఇక్కడ ఏటువంటి కరువు వచ్చిందనుకున్నావు? ఏదో దేవతా సర్పం వచ్చి వాన కురిపించింది. దానికి గుడి కూడా కట్టాం. కాని అది కొంత కాలానికి ఎటో వెళ్ళిపోయింది." అని చెప్పారు.

"నేనే ఆ సర్పాన్ని," అన్నాడు శిల్పి.

చాలామంది అతని మాట నమ్మలేదు. అతను ఊళ్ళో అందరికీ తన అనుభవాలు చెప్పాడు. అప్పుడు జనం నమ్మటమే గాక, అతను గ్రామానికి చేసిన మేలు తెలుసుకుని ఎంతో గర్వపడ్డారు.

అటు తరవాత ఆ గ్రామానికి సర్పపురం అనే పేరు వచ్చింది.





# పిచ్చిరాజు

గౌడదేశాన్ని దేవవర్మ అనే రాజు పాలించేవాడు. ఆ రాజు వట్టి మూఢుడు. ప్రజలు అతన్ని పిచ్చిరాజు అనేవాళ్ళు.

ఒకనాడు దేవవర్మ దర్శనానికి ఒక దొంగ సాధువు వచ్చాడు. ఆ జిత్తులమారి వాడు రాజు తత్వం గ్రహించి, "మహారాజా, తమరు ఏదో తీరని కోరికతో బాధ పడుతున్నట్టు నాకు తెలుస్తున్నది. ఏమిటి మీ కోరిక? నా తపశ్శక్తికి సాధ్యమైతే మీ కోరిక తీరే ఉపాయం చెబుతాను," అన్నాడు.

వెంటనే దేవవర్మ, "యోగి పుంగవా, బాగా కనిపెట్టారు. నేను ఎందరో చక్రవర్తుల కథలు విన్నాను. నేను చక్రవర్తిగా పుట్టి ఘనంగా బతకలేక పోతినే అన్న బాధ నన్ను అప్పుడప్పుడూ బాధిస్తూ ఉంటుంది. దానికి మీరు మాత్రం ఏం చెయ్యగలరు?" అంటూ నిట్టూర్పు విడిచాడు.

దొంగసాధువు కొంచెం ఆలోచించినట్టు నటించి, "ఈ ఆలోచన తమకు ఊరికే వచ్చి ఉండదు. తమ జాతకం ఒకసారి ఇప్పించండి," అన్నాడు.

రాజు ఆస్థానజ్యోతిష్కులతో, తన జాతక చక్రాన్ని సాధువుకు చూపించమన్నాడు.

సాధువు జాతకం చూసి, "అరెరే, ఇరవైయేళ్ళక్రితం తమకు చక్రవర్తియోగం వెంట్రుకవాసిలో తప్పిపోయింది. అప్పుడు గ్రహశాంతి చేయించినట్టయితే తప్పకయోగం సిద్ధించేది. ఇప్పటికైనా మించిపోలేదు. మరొక ఇరవై ఏళ్ళు గడిస్తే మీరు విధిగా చక్రవర్తి అవుతారు," అన్నాడు.

పిచ్చిరాజు ఈ మాటకు పరమానంద భరితుడై, దొంగ సాధువుకు కోరినంత డబ్బు ఇచ్చి పంపేశాడు.

అది మొదలు ఆ రాజుకు చక్రవర్తి కావాలన్న ఆర్భాటం క్రమంగా హెచ్చి

వల్లూరు

పోయింది. ఇరవై ఏళ్ళు ఆగాలంటే ఆయనకు చాలా బాధగా ఉన్నది. ఆ బాధ భరించలేక ఆయన ఒక పిచ్చి ఆలోచన చేశాడు. ఆయన తన ఆస్థాన జ్యోతిష్కులను పిలిచి, "రేపటి నుంచీ పంచాంగాన్ని ఇరవై సంవత్సరాలు ముందుకు జరపండి. తిథి, వార, నక్షత్రాలన్నీ ఇరవై ఏళ్ళు ముందుకు నెట్టి, కొత్త పంచాంగం తయారు చెయ్యండి," అన్నాడు.

జ్యోతిష్కులు ఈ ఉత్తరువుకు నిర్ఘాంతపోయి, వెళ్ళి మంత్రితో తమకు వచ్చిన కష్టాన్ని మొరపెట్టుకున్నారు.

మంత్రి రాజు వద్దకు వెళ్ళి, "మహా రాజా, తమరు పంచాగాన్ని ఇరవై సంవత్సరాలు ముందుకు నెట్టమన్నారు. అలా చెయ్యటం ఏమంత కష్టం కాదు. కాని అందువల్ల కలిగే చిక్కులను తమరు ఆలోచించినట్టు కనబడదు," అన్నాడు.

"ఏమిటా చిక్కులు?" అని రాజు అడిగాడు.

"తమకిప్పుడు నలభై ఏళ్ళు. ఈ ప్రకారమైతే తమరు అరవై ఏళ్ళవారయిపోతారు. యువరాజుగారికి ఇరవై అయిదేళ్ళు వస్తాయి. ఆయనను సింహాసనం మీద కూర్చొబెట్టి తమరు వానప్రస్థం వెళ్ళవలసి ఉంటుంది." అన్నాడు మంత్రి.

రాజు తెల్లబోయి, "అది పెద్ద చిక్కేనే! పోనీ ఒక పని చేద్దాం. పంచాంగాన్ని ఇరవై సంవత్సరాలు వెనక్కు పెట్టిద్దాం. గ్రహశాంతి చేసి నేను వెంటనే చక్రవర్తి యోగం పొందుతాను," అన్నాడు.

"అందులో ఇంకా ఎక్కువ చిక్కులున్నాయి. ఇరవై ఏళ్ళ క్రితం తమరికింకా సింహాసనార్హత లేదు. పెద్ద రాజుగారు మంచి నడి వయసులో ఉన్నారు. పంచాంగం వెనక్కునెట్టి సింహాసనాన్ని వదులుకుంటారా?" అని మంత్రి అడిగాడు.

రాజు భయపడి, "వద్దు, వద్దు!" అన్నాడు. ఆయన జ్యోతిష్కులను పిలిచి, "మీలో ఎవరన్నా పంచాంగాన్ని వెనక్కుగాని, ముందుకుగాని జరిపినట్టు తెలిసిందో, మీ తలలు తీసి కోట గుమ్మానికి వేళ్ళాడగడతాను, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.





# భర్తకోసం

పూర్వం ఉజ్జయినీ నగరంలో సాగరదత్తు డనే వర్తకుడు ఉండేవాడు. అతని సంపద అంతులేనిది. ఆయన ఒకసారి నౌకా వ్యాపారం చేస్తూ సముద్రమధ్యంలో మరొక నౌకను కలుసుకున్నాడు. అది కూడా వర్తక నౌకే. దాని యజమాని రాజగృహానికి చెందిన బుద్ధవర్మ అనే వర్తకుడు.

సాగరదత్తుడికీ, బుద్ధవర్మకూ మంచి స్నేహం కలిసింది. తమలో ఒకరికి మగ పిల్లవాడూ, రెండో వారికి ఆడపిల్లా కలిగే పక్షంలో వారిద్దరికీ పెళ్ళి చేసి వియ్యమందు దామని ఇద్దరూ అనుకున్నారు.

సాగరదత్తుడు వ్యాపారం ముగించుకుని ఇంటికి తిరిగి వచ్చేసరికి, మల్లెపూల మాల వేసిన పసిపిల్లను తెచ్చి అయనకు అందించారు.

"ఎవరీ మల్లిక?" అని సాగరదత్తుడు తన భార్యను అడిగాడు.

ఆమె సిగ్గుపడుతూ, "మీ కూతురే!" అన్నది.

ఆ పిల్లకు మల్లిక అనే పేరు ఖాయమయింది.

తాను బుద్ధవర్మ అనే వైశ్యోత్తముడితో చేసుకున్న ఒప్పందం గురించి సాగరదత్తుడు తన భార్యకు చెప్పి, ఈ వార్త రాజగృహంలో ఉండే బుద్ధవర్మకు పంపాడు.

బుద్ధవర్మ వర్తకానికి బయలుదేరే సమయానికే ఆయన భార్య నిండు చూలాలు. అందుచేత ఆయన ఇంటికి తిరిగి వస్తూనే భార్యను, "ఏం బిడ్డను కన్నావు?" అని అడిగాడు. ఆమె తాను కన్న బిడ్డను తెచ్చి భర్తకు చూపింది. వాడు ఎముకలపోగు. వాడికి ఒకటే కన్ను దానికితోడు గూని కూడా ఉన్నది.

"ఈ ఒంటెను ఎందుకు కన్నావు?" అని బుద్ధవర్మ భార్యపైన విసుక్కున్నాడు.



తండ్రి అలా అనటం మూలాన ఆ కుర్ర వాడికి ఓష్ఠుడు అన్న పేరు ఖాయమయింది.

ఇంతలో సాగరదత్తుడికి కుమార్తె కలిగి నట్టు వార్త వచ్చింది. వార్త తెచ్చిన మని షికి ఉచితమైన స్వాగతం చెప్పి, బుద్ధవర్మ తన భార్యతో, "చూడు, ఏమయిందో? ఇప్పుడు మనం ఏమని కబురు పంపాలి?" అన్నాడు.

"అడిగారు గనక నా సలహా వినండి. వర్తకుడు తన స్వార్థం కోసం నిజాన్నీ అబద్ధాన్నీ సమన్వయించాలి. మనకు కొడుకు కలిగాడని చెప్పండి. అందులో అబద్ధం లేదు గదా. వాడిది వర్ణనాతీతమైన ఆకారమని తెలపండి. వాడి స్వరూప స్వభావాలు చూసి తెలుసుకోవలిసిందేనని కబురు చెయ్యండి. అంతేగాని, సాగరదత్తుడి సంబంధాన్ని వదులుకోవద్దు. లక్ష్మిని కాల తన్నరాదు!" అన్నది బుద్ధవర్మ భార్య.

బుద్ధవర్మ సాగరదత్తుడి దూతకు తన భార్య చెప్పమన్నట్టే చెప్పి, దారి బత్తెం ఇచ్చి పంపేశాడు.

ఎనిమిదేళ్ళపాటు ఇలాగే రాజగృహ ఉజ్జయినీ నగరాల మధ్య రాయబారాలు సాగాయి. అటు తరవాత సాగరదత్తుడు పంపిన దూత రాజగృహానికి వచ్చి, "అయ్యా, ఈసారి కుర్రవాణ్ణి చూసి, అతడి గుణ రూపాలు తెలుసుకోకుండా తిరిగి రావద్దని మా యజమాని కట్టడి చేసి మరీ పంపారు," అన్నాడు.

బుద్ధవర్మ తడువుకోకుండా, "మా వాడు తామ్రలిప్తిలో వాడి మేనమామ వద్ద ఉండి చదువుకుంటున్నాడు," అని అబద్ధం ఆడాడు.

మరొక నాలుగు సంవత్సరాల కాలం ఈ సాకుతోనే గడిచింది. తరవాత ముగ్గురు నలుగురు ఆరితేరిన చతురులు సాగరదత్తుడి వద్ద నుంచి బుద్ధవర్మ వద్దకు వచ్చి, "అయ్యా, మీ మిత్రుడైన సాగరదత్తుడు గారూ, వారి భార్యా తమతో ఇలా చెప్ప మన్నారు: "ఇప్పటికి పదమూడు, పధ్నాలుగేళ్ళు గడిచి పోయినప్పటికీ, మాకు కాబోయే

అల్లుడు ఎలా ఉంటాడో మాకు తెలియ రాలేదు. సరుకు దాచి బేరమాడటం సబబు కాదన్నది మీకు తెలునుగదా. మీ కుమారుడు తామ్రలిప్తిలో ఇంత కాలంగా చదువు తున్నాడన్నది అసందర్భమైన విషయం. వేదాధ్యయనానికి కూడా ఇంతకాలం పట్టదు. మీ కుర్రవాడు మిగిలిన బాధ్యతలన్నీ విడిచి పుచ్చి యావజ్జీవం అధ్యయనంలో గడపటం అసాధారణంగా ఉన్నది. కనుక ఈ హాస్యాలు కట్టి పెట్టి, మీ ఇంటనైనా సరే, తామ్రలిప్తిలో అయినా సరే మీ కుమారుణ్ణి చూపించండి," అన్నారు.

"మహాజనులారా, కొంచెం విశ్రాంతి తీసుకోండి," అని బుద్ధవర్మ దూతలతో చెప్పి, భార్య వద్దకు వెళ్ళి, "వాళ్ళు మనవాణ్ణి చూడాలని పట్టుబట్టి కూర్చున్నారు. వాళ్ళకు మనవాడి ఎత్తు పళ్ళూ, గుడ్డి కన్నూ, గూనీ ఎలా చూపటం? అసంభవం! ఇప్పుడు మరేదన్నా ఉపాయం చెప్పు," అన్నాడు.

"ఉపాయం ఎప్పుడో ఆలోచించాను," అంటూ బుద్ధవర్మ భార్య తన ఆలోచనను భర్త చెవిలో ఊదింది.

బుద్ధవర్మ చేసే దానధర్మాల మీద బతుకుతున్న బ్రాహ్మణుడు ఒకడు ఉన్నాడు. బుద్ధవర్మ ఆయనను ఏకాంతంగా కలుసుకుని, తనకు వచ్చిన విషమ సమస్య వివరించి చెప్పి, "ఇప్పుడు నీ సహాయం



లేకపోతే నా పరువు దక్కదు. నీ కొడుకు యజ్ఞగుప్తుడు అందగాడూ, సకల శాస్త్రాలూ చదివినవాడూను. నా కొడుకు బదులు అతను వెళ్ళి సాగరదత్తుడి కుమార్తెను పెళ్ళాడి, ఆమె కన్యాత్వానికి భంగం రాకుండా తెచ్చి మా ఇంట దిగవిడిచి నట్టయితే, నేను పిల్ల తెచ్చే అరణంలో నీకు భాగం ఇస్తాను," అన్నాడు.

"నీ కోరిక నాకు ఆజ్ఞ కాదా?" అని ఆ బ్రాహ్మణుడు తన కొడుకును పిలిచి, సంగతంతా చెప్పాడు.

"గురువుల ఆజ్ఞకు గుణదోషాలు ఎంచరాదు," అని యజ్ఞగుప్తుడు బుద్ధవర్మ చెప్పినట్టు చెయ్యటానికి సమ్మతించాడు.

ఒకటి రెండు రోజులు గడవనిచ్చి, "నా కొడుకు తామ్రలిప్తి నుంచి తిరిగి వచ్చాడు," అంటూ యజ్ఞగుప్తుణ్ణి అలంకరించి, సాగరదత్తుడి దూతలకు చూపించాడు బుద్ధవర్మ.

వాళ్ళు, "మల్లిక అదృష్టవంతురాలు," అని బుద్ధవర్మ వద్ద సెలవు పుచ్చుకుని, మంచి రోజు చూసి పెళ్ళికి బయలుదేరి రావలిసిందిగా ఆయనను హెచ్చరించి వెళ్ళిపోయారు.

తరవాత బుద్ధవర్మ యజ్ఞగుప్తుణ్ణి పెళ్ళికొడుకును చేసి, తన కొడుకుకు బ్రాహ్మడి వేషం వేసి, పెళ్ళి కొడుకు తాలూకు సంచి కట్టు అతనికి ఇచ్చి, పరివారంతో సహా ఉజ్జయినికి పంపాడు.

మర్నాడు ఉదయం వివాహం జరిగింది. వధూవరులు అగ్నికుండం చుట్టూ తిరగటం పూర్తి అవుతూనే పెళ్ళి కొడుకు పెద్ద పెట్టున అరిచి, స్పృహ తప్పినట్టు పడిపోయాడు. చాలాసేపు ఉపచారాలు చేసిన మీదట యజ్ఞగుప్తుడు కొద్దిగా కళ్ళు తెరిచి, హీనస్వరంతో, "డొక్కలో శూల వచ్చింది," అన్నాడు.

అతన్ని లోపలి గదిలో చేర్చి వైద్యులు చికిత్స చేశారు. కొత్త పెళ్ళి కూతురు సిగ్గుపడకుండా అతని వద్దనే ఉండి, వైద్యులు పొయ్యమన్న మందులన్నీ అతని నోట పోస్తూ వచ్చింది. అయితే ఎన్ని మందులిచ్చినా అతని జీర్ణకోశ వ్యాధి మాత్రం పూర్తిగా పోలేదు.



గూనివాడు పెళ్ళి కూతురితో సరసాలు ప్రారంభించాడు. అది చూసి మల్లిక చిరాకు పడింది. యజ్ఞగుప్తుడు ఆమెతో, "హాస్య గాడి మీద ఆగ్రహిస్తావేమిటి? వాణ్ణి అలాగే వాగనీ!" అన్నాడు.

కాని గూని వెధవ అసలు రహస్యం ఎక్కడ బయట పెట్టేస్తాడోనన్న భయం యజ్ఞగుప్తుణ్ణి బాధించసాగింది. అందుచేత అతను సాగరదత్తుడితో, "నాకు మా తలి దండ్రులను చూడాలని ఉన్నది," అన్నాడు.

వైద్యుడు సాగరదత్తుడితో, "అజీర్తికి ఇవ్వగల ఔషధాలన్నీ ఇచ్చాము. ఏమీ గుణం కనిపించలేదు. తన వాళ్ళను చేరు కుంటే అతని ఆరోగ్యం బాగుపడవచ్చు. శీఘ్రమే పంపెయ్యటం మంచిది," అన్నాడు.

సాగరదత్తుడు తన కుమార్తెనూ, అల్లుణ్ణీ ప్రయాణానికి సిద్ధం చేయించి, ఆమెకు భరణంగా తాను ఇచ్చే వస్తు సామగ్రిని అనేక ఒంటెల మీద వేయించి దాసీ జనాన్నీ, అంగరక్షకులనూ ఇచ్చి రాజ గృహానికి పంపేశాడు. ఆయన నౌకర్లు ముందుగానే ప్రయాణమై వెళ్ళి ప్రతి మజిలీ వద్దా తగిన ఏర్పాట్లు చేసి, పెళ్ళి కొడుకు ఆరోగ్యం గురించి కబుర్లు తెస్తూ వచ్చారు.

ఒక్కొక్క మజిలీ దాటుతున్న కొద్దీ మారు పెళ్ళి కొడుకు మాయ జబ్బు నయ మవుతూ వచ్చింది. రాజగృహం చేరే సరికి అతను సంపూర్ణ ఆరోగ్యం పొందాడు. ఈ వార్త అందగానే సాగరదత్తుడు ఆనంద



భరితుడై ఉజ్జయినిలోని అన్ని వర్ణాలవారికీ అంతులేని దానాలు చేశాడు.

బుద్ధవర్మ తన కోడలిని చూసి మహదానందం చెందాడు. ఆ రాత్రి వధూవరులను శోభనపు గదికి పంపారు. ఆ గదిలో మల్లికతో పాటు ఆమె చెలికత్తెలూ, గూనివాడూ, యజ్ఞగుప్తుడూ కూడా ఉన్నారు.

"ఈ గూనివాడు ఈ గదిలో ఎందుకున్నాడు ?" అనుకున్నది మల్లిక.

"పానకంలో పుడకలాగా ఈ బ్రాహ్మణ వటువు ఇక్కడ ఇంకా దేనికీ ?" అనుకున్నాడు గూనివాడు.

సందర్భం గ్రహించి యజ్ఞగుప్తుడు వెళ్ళిపోవటానికి లేచాడు. అది చూసి మల్లిక, "అయ్యో, మీరెక్కడికి పోతున్నారు ? నాగతి ఏమిటి ?" అని ఆక్రోశించింది.

"నీకు వచ్చిన దుర్గతి ఏమీ లేదు. విధి నీకు ఏ మొగుణ్ణి రాసిపెట్టిందో వాడితో జీవయాత్ర సాగించు. ఇందులో నా వంతు పాప భారం మాత్రమే," అంటూ యజ్ఞగుప్తుడు బయటికి వెళ్ళిపోయాడు.

గూనివాడు మల్లికను పట్టుకుని ఆపబోయాడు, కాని మల్లిక కెవ్వున అరిచి బయటికి పరిగెత్తింది. ఆమె గదులన్నీ దాటుకుంటూ ఇంటి బయటికి వచ్చింది. అన్ని గదులలోనూ మనుషులు తప్పతాగి ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్నారు. కొందరు దాసీలు ఆనందంతో నృత్యాలు చేస్తున్నారు.

మల్లిక వీధిలోకి వచ్చి, ఎవరినో చూసి, "అడుగో ! అడుగో !" అనుకుని అటుగా పరిగెత్తింది. తరవాత తాను ఎటు పోతున్నదీ ఆమెకు తెలియలేదు. ఒక చోట దారి పక్కన, తప్పతాగి ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న కాపాలికుడు ఒకడు ఆమెకు కనిపించాడు.

ఆమె తన కర్తవ్యాన్ని నిర్ణయించుకుని, తన నగలన్నీ తీసి మూటగట్టి బొడ్డులో దోపుకుని, కాపాలికుడి పరికరాలన్నీ సంగ్రహించి తాను ఆ వేషం వేసుకున్నది. తాను కూడా తాగిఉన్నట్టు తూలుతూ నగరం దాటి ఒక గ్రామం కేసి వెళ్ళింది.

—(ముగింపు వచ్చే సంచికలో)






# బుద్ధి బలం

ఉత్తరదేశంలో ఒక గ్రామంలో వీరసింహుడూ, జ్ఞానప్రకాశుడూ అని ఇద్దరు యువకులు ఉండేవారు. వారిద్దరూ మంచి స్నేహంగా ఉండేవారు. కాని వారి స్వభావాలు విరుద్ధంగా ఉండేవి. జ్ఞానప్రకాశుడు బక్కగానూ, బలహీనంగానూ ఉండేవాడు. కాని అతనిది సూక్ష్మబుద్ధి. వీరసింహుడు బలమూ, ధైర్యమూ, తొందరపాటూ గలవాడు; అతనికి తెలివితేటలు తక్కువ. ఇద్దరూ బీద కుటుంబాలకు చెందినవాళ్ళే.

స్నేహితులిద్దరూ ఒకసారి దూర గ్రామానికి బయలు దేరారు. మధ్య దారిలో వీరసింహుడికి ఆకలి అయింది. దూరాన ఒక గ్రామం కనిపిస్తున్నది. అక్కడికి వెళ్ళి, ఎవరినన్నా భోజనం అడుగుదామన్నాడు వీరసింహుడు.

"నాకు అంతగా ఆకలి కావటం లేదు. అదీకాక, ఇద్దరమూ ఒక్కసారిగా పోతే భోజనం దొరుకుతుందో, దొరకదో. నువు ముందువెళ్ళి భోజనం చేసిరా," అన్నాడు జ్ఞానప్రకాశుడు.

అసలు సంగతి ఏమిటంటే, దుడుకుతనం కొద్దీ వీరసింహుడు ఊరి వాళ్ళతో కొట్లాట పెట్టుకుంటాడు. అతనికి ఆకలి వేస్తే ఉన్న మతి కూడా పోతుంది. బొత్తిగా బుర్ర ఉపయోగించలేడు. ఈ మాట జ్ఞానప్రకాశుడికి బాగా తెలుసు. అతనితో వెళ్ళితే అన్నం కాదు గదా, మంచి నీరు కూడా పుట్టకపోవచ్చు. అందుచేతనే అతను గ్రామంలోకి వీరసింహుణ్ణి ఒంటరిగా పంపాడు.

వీరసింహుడు గ్రామం ప్రవేశించగానే ఒక ఇంట, పొలానికి పోబోతూ ఒక రైతు భోజనం చేస్తున్నాడు. వీరసింహుడు ఆ ఇంట ప్రవేశించి, "ఆకలిగా ఉన్నది. నాక్కూడా భోజనం పెట్టండి," అని దబాయించి అడిగాడు.

ఆర్. అనంతశర్మ



రైతూ, రైతు భార్యా అతని ధాష్టీకానికి నివ్వెరపోయారు.

"మిమ్మల్నే అడిగేది. నాకు వెంటనే భోజనం పెట్టండి." అని వీరసింహుడు ఉరిమాడు.

"ఏమిటి నీ దబాయింపు? నీకు మేమెందుకు భోజనం పెట్టాలి? నువ్వేమన్నా మా చుట్టానివా?" అని రైతు అడిగాడు.

"అన్నం పెడతావా? బడితపూజ చెయ్యమన్నావా? ఆకలిగా ఉందని చెప్పటంలా?" అన్నాడు వీరసింహుడు చేతికర్ర ఆడిస్తూ.

ఈలోగా రైతు భార్య దొడ్డి గుమ్మాన వెళ్ళి పదిమందినీ తీసుకొచ్చింది. వాళ్ళు వెనక పాటున వచ్చి వీరసింహుణ్ణి తల మీద కర్రతో బాదారు. ఆ దెబ్బకు వీరసింహుడు కింద పడిపోయాడు. కింద పడ్డ వీరసింహుణ్ణి అందరూ తలా ఒక తన్నూ తన్ని వీధిలోకి గెంటారు. చావు తప్పి కన్ను లొట్టపోయి వీరసింహుడు కాలిసత్తువ కొద్దీ తన మిత్రుడున్న చోటికి పారిపోయి వచ్చాడు.

జ్ఞానప్రకాశుడు వీరసింహుడికి పట్టిన గతి అర్థం చేసుకుని, "నువు ఈ చెట్టు కిందనే ఉండు. ఒక గంటలో భోజనం తెచ్చి పెడతాను," అని చెప్పి గ్రామం కేసి బయలుదేరాడు.

అతను ఆ రైతు ఇంటికే వచ్చి, అక్కడ ఇంకా గుమిగూడి ఉన్న జనాన్ని చూసి, రైతుతో, "అయ్యా, కొంచెం అన్నం పెట్టించండి," అని వినయంగా అడిగాడు.

అంతకు మునుపు జరిగిన దానితో మండి ఉన్న రైతు, "ఇదేదో వేళాకోళంగా ఉన్నట్టుందే! నీకు అన్నంగాదు దుడ్డుకర్రతో దెబ్బలు ఇస్తాను," అన్నాడు.

జ్ఞానప్రకాశుడు చేతులు జోడించి, "నేను ఆకలితో ఉన్న మాట నిజమేగాని, దుడ్డుకర్ర దెబ్బలు తినలేను," అన్నాడు. అందరూ పక్కున నవ్వారు.

"ఈ గ్రామంలో వాళ్ళు ధనవంతులనీ, దయాపరులనీ విన్నాను. భోజనం పెట్టక

పోతేమానె, ఒక పాత్రా, నాలుగు కట్టె పుల్లలూ ఇవ్వండి. నేనే వంట చేసు కుంటాను. నాకు అద్భుతమైన వంటకం చెయ్యటం తెలుసు," అన్నాడు జ్ఞాన ప్రకాశుడు.

ఎవరో జాలిపడి ఒక కుండ ఇచ్చారు. కొందరు ఎండు పుల్లలు తెచ్చారు. జ్ఞాన ప్రకాశుడు వీధి వారగా మూడు రాళ్ళు తెచ్చి పొయ్యి అమర్చి, కుండలో నీళ్ళు పోసి దాని మీద పెట్టి, కింద చితుకులతో మంట చేసి, కుండలో నీరు మరిగేటప్పుడు అందులో ఒక చిన్న గులకరాయి వేశాడు. అతను చేసే అద్భుతమైన వంటకం ఏమిటో చూడా లని ఊళ్ళో ఉన్న పిల్లలందరూ అతని చుట్టూ చేరారు.

కొంతసేపు అయాక జ్ఞానప్రకాశుడు కుండలో నీళ్ళు రుచి చూసి, "అద్భుతం! ఇందులో ఒక ఉర్లగడ్డ వేస్తే ఇంకా బాగుం టుంది," అని అందరూ వినేటట్టు తనలో తాను అనుకున్నాడు. వెంటనే కొందరు కుర్రాళ్ళు పరిగెత్తుకుంటూ వెళ్ళి తలా ఒక ఉర్లగడ్డా తెచ్చారు. జ్ఞానప్రకాశుడు వాటిని కుండలో వేశాడు.

మరి కాస్సేపు ఉండి రుచిచూసి అతను, "భేష్! ఇందులో కాస్త పప్పూ, ఒకటి రెండు కూరగాయలూ, కొద్దిగా బియ్యమూ వేస్తే దీని రుచి చెప్పటానికి ఉండదు!" అన్నాడు. అనటమే తరవాయి, కుర్రాళ్ళు వెళ్ళి అతను కోరినవన్నీ తెచ్చారు. త్వర లోనే కమ్మని సంకటి తయారయింది.

జ్ఞానప్రకాశుడు దాన్ని రుచి చూసి, "ఎంత పొరపాటూ! ఇందులో ఉప్పు వెయ్యటం మరిచాను సుమా!" అన్నాడు. మరుక్షణం ఉప్పు కూడా వచ్చింది. ఉప్పు కూడా కలిపినాక జ్ఞానప్రకాశుడు కుండతో వీరసింహుడున్న చోటికి వెళ్ళాడు.

ఇద్దరూ కుండలో ఉన్న సంకటి కడుపు నిండా తిని, తాము తినగా మిగిలినది తమ వెంట ఉన్న కుర్రవాళ్ళకిచ్చి, "రుచి చూడండి. తరవాత కుండ శుభ్రంగా కడిగి, రైతుకు ఇచ్చెయ్యండి," అని చెప్పి, తమ దారిన తాము వెళ్ళారు.



# తాన్‌సేన్ గురువు

తాన్‌సేన్ గానానికి ముగ్ధుడైన అక్బర్‌పాదుషా తాన్‌సేన్ గురువుగారి గానాన్ని కూడా వినాలని ఉబలాట పడ్డాడు. అందుచేత తాన్‌సేన్ ఆయనను, అరణ్యంలో తన గురువు తపస్సు చేసుకుంటున్న గుహకు తీసుకుపోయాడు.

తాన్‌సేన్ గురువు తపస్సమాధిలో ఉన్నాడు. ఆయన తన గుహనుంచి ఎంతసేపటికి బయటికి రాకపోయేసరికి, తాన్‌సేన్ అపస్వరాలతో ఒక పాట పాడాడు.

వెంటనే గురువు ఇవతలికి వచ్చి, "ఓరీ, అప్రాచ్యుడా, నా శిష్యుడివై ఉండి అలాగా పాడేది?" అంటూ తాను పాడనారంభించాడు. ఆయన పాట వినటానికి అడవిలో ఉండే జంతువులు వచ్చాయి. అక్బరు పరమానందం చెందాడు.

వాళ్ళు తిరిగి వచ్చాక అక్బర్ తాన్‌సేన్‌తో, "మీ గురువుగారు పాడితే జంతువులు కూడా వినటానికి వచ్చాయి గదా, నువు పాడితే రావేం?" అని అడిగాడు.

దానికి బీర్‌బల్, "తాన్‌సేన్‌గారి గురువు అల్లా ఆస్థాన గాయకుడు. తాన్‌సేన్ తమ ఆస్థానానికే గదా గాయకుడు?" అన్నాడు.

—"మల్లీప్రియ" నాగరాజు





# ప్రగల్భుడి పాట్లు

ఒక ఊళ్ళో మాణిక్యవర్మ అనే ఒక గృహస్థు ఉండేవాడు. అతనికి ఏ పనీ చేయకపోయినా సుఖంగా జరిగిపోయేటందుకు తగినంత పిత్రార్జితం ఉన్నది. అందుచేత అతను ఊళ్ళో వాళ్ళతో తన శక్తి సామర్థ్యాలను గురించి ప్రగల్భాలు ఆడుతూ కాలక్షేపం చేసేవాడు. పది రూపాయల ఖరీదు చేసే వస్తువును తాను అయిదు రూపాయలకే కొన్నాననేవాడు. అతడి తెలివి తేటలన్నీ ప్రగల్భాలు సృష్టించటానికే వినియోగపడేవి.

ఒకనాడు మాణిక్యవర్మ హరికథా కాలక్షేపానికి వెళ్ళాడు. అక్కడ అతనికి మరొక మనిషి పరిచయమయాడు. హరికథ ముగిసినాక ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ కొంత దూరం కలిసి నడిచారు. మధ్య దారిలో ఆ కొత్త మనిషి మాణిక్యవర్మతో ఇలా అన్నాడు:

"ఇవాళ రాజుగారి ఇంట్లో ఒక చిత్రం జరిగింది. రాజుగారు పదిమందితోనూ మాట్లాడుతూ ఉండగా, రాణీగారికి కడుపు ఉబ్బరించిందని లోపలి నుంచి వర్తమానం వచ్చింది. రాజుగారితో మాట్లాడుతున్న వారిలో ఒక పొరుగూరి వైద్యుడున్నాడు. ఆ సంగతి తెలిసి రాజుగారు అతన్ని లోపలికి వెళ్ళమనీ, రాణీగారికి వైద్యం చెయ్యమనీ అన్నాడు. ఆ వైద్యుడు లోపలికి వెళ్ళి, ఇంత శొంఠిరసం పొంగించి, బెల్లం కలిపి ఇచ్చాడు. రాణీగారి కడుపు ఉబ్బరం తీసేసినట్టు పోయింది. అప్పుడు రాణీగారు ఏం చేసిందో తెలుసా? దగ్గిర ఎవరూ లేకుండా చూసి, తన మెడలోని రత్నహారం తీసి వైద్యుడికి బహుమానం ఇచ్చి, దాన్ని భద్రంగా దాచుకోమనీ, ఎవరికీ చెప్పవద్దనీ అన్నది. చూశారా, ఇంత శొంఠికషాయం ఇచ్చినందుకు బహుమతి

వి. లక్ష్మీకాంతమ్మ



రత్నహారం! అందుకే, సేవ చేస్తే గొప్ప వాళ్ళకు చెయ్యాలి. బీదా బిక్కికి సేవ చేస్తే ఏం గిట్టుబాటవుతుంది? ఆ వైద్యుడు నాకు మిత్రుడు కావటం చేత ఈ రహస్యం నాకు చెప్పాడు.''

ఇలా మాట్లాడుకుంటూ వాళ్ళిద్దరూ ఒక దిగుడు బావి వద్దకు వచ్చారు. ఈ వృత్తాంతం చెప్పినవాడు తనకు దాహంగా ఉన్నదని చెప్పి, దిగుడు బావిలోకి దిగాడు. అతను మళ్ళీ పైకి వచ్చినాక కొంతదూరం మాణిక్యవర్మ అతనితో కలిసి నడిచాడు. తరవాత ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు.

మాణిక్యవర్మ ఇల్లు చేరేసరికి బాగా పొద్దు పోయింది.

''చాలా రాత్రి అయింది. ఇంత దాకా ఎక్కడికి వెళ్ళారు?'' అని మాణిక్యవర్మను భార్య అడిగింది.

ప్రగల్భాలకు అలవాటు పడిన మాణిక్యవర్మ తన భార్యతో, ''ఇవాళ ఎంత చిత్రం జరిగిందనుకున్నావు? అలా రాజుగారి నొకసారి చూసి వద్దామని వెళ్ళాను. ఆ సమయంలో రాణీగారికి భరించరాని శూలనొప్పి వచ్చిందన్నారు. నేను నయం చేస్తానన్నాను. నన్ను లోపలికి తీసుకు వెళ్ళారు. ఆ అంతఃపుర వైభవం ఏమని చెప్పను? హంసతూలికా తల్పం మీద రాణీగారు కడుపు నొప్పితో మెలికలు తిరిగి పోతున్నారు. నేను వెంటనే కుంపటి వెలిగించి, ఇంత శొంఠిరసాన్ని బెల్లంతో పొంగించి రాణీగారికి ఇచ్చాను. అది కడుపులోకి పోవటమేమిటి, రాణీగారి శూల మాయం కావటమేమిటి, ఒక్కసారే జరిగాయి. రాజుగారు నా వైద్యాన్ని మెచ్చుకుని తన మెడలో నుంచి రత్నహారం అమాంతంగా తీసి నా చేతిలో పెట్టారు. అందుకే ఇంటికి రావటానికి ఇంత ఆలస్యమయింది,'' అన్నాడు.

''ఏదీ ఆ రత్నహారం కాస్త చూడనివ్వండి?'' అన్నది భార్య.

''అది ఎలా ఉందనుకున్నావు? ధగధగా మెరిసి పోతున్నది! అంత అపూర్వమైన రత్నహారాన్ని అర్ధ రాత్రివేళ మన

ఇంట్లో దాచటం క్షేమం కాదని, వచ్చే టప్పుడు దిగుడు బావిలో దాచి మరీ వచ్చాను. చీకటితో వెళ్ళి తెచ్చుకుందాం," అన్నాడు మాణిక్యవర్మ.

అతని భార్య ఆ రాత్రి కన్ను మూయ లేదు. ఆ రత్నహారం కళ్ళ చూసే దాకా ఆమెకు ఆకలి దప్పులు కూడా తెలిసేటట్టు లేవు. ఆమె తూర్పు తెల్లవారేదాకా మేలు కునే ఉండి, అప్పుడు బిందె చంకన పెట్టు కుని దిగుడు బావికి వెళ్ళి, అందులోకి దిగింది.

ఒక తొర్రలో ఆమెకు హారం కనిపించనే కనిపించింది. ఆమె దాన్ని తీసి, ఎక్కడ లేని సంతోషంతో, "ఆహా!" అంటూ తల తిరిగి, బావిలో పడిపోయి, పెద్దగా కేకలు పెట్టసాగింది.

ఆ కేకలు విని మనుషులు పరిగెత్తు కుంటూ వచ్చి, ఆమెను పైకి తీశారు. ఆమె చేతిలో ఇంకా రత్నహారం ఉన్నది. అది నలుగురి కంటా పడింది. ఈ వార్త క్షణంలో రాజభటులకు తెలిసింది. కిందటి రోజు రాణిగారి రత్నహారం పోయినప్పటి నుంచీ రాజభటులు దొంగ కోసం వెతుకు తూనే ఉన్నారు.

కిందటి రోజు రాణిగారికి కొద్దిగా కడుపు ఉబ్బరం చేసిన మాట నిజమే. ఆమెకు వైద్యం చేసినవాడు మరెవరో కాదు, మాణి క్యవర్మకు హరికథ దగ్గిర పరిచయం అయినవాడే. వాడే రత్నహారం దొంగిలిం చిన వాడు కూడా. రాజభటులు తనను గుర్తించి పట్టుకుంటారని హరికథ దగ్గిర గుంపులో దూరాడు. నగరద్వారం నుంచి వెళ్ళిపోయేటప్పుడు ద్వారరక్షకులు సోదా చేస్తారని రత్నహారాన్ని దిగుడు బావిలో దాచాడు. వాడు చేసిన ఒక పొరబాటూ ఏమిటంటే, ప్రగల్భరాయుడైన మాణిక్య వర్మతో మాట్లాడటం.

మాణిక్యవర్మ ఎంత మొత్తుకున్నా రాజు గారు వినక అతనే దొంగ అని నిర్ణయించి, బెత్తంతో కొట్టించాడు. ఆ దెబ్బలతో మాణిక్య వర్మకు ప్రగల్భాలు పలికే దురలవాటు పూర్తిగా పోయింది.



# దొంగ — దొర

ఒక మనిషి ఒక గుర్రాల వర్తకుడి వద్ద నుంచి ఒక గుర్రాన్ని దొంగిలించటానికి ప్రయత్నించి దొరికిపోయాడు.

"ఎందుకు చేశావు ఇలాటి పాడుపని?" అని గుర్రాల వర్తకుడు దొంగను అడిగాడు.

"బాబూ, నాలుగు రోజుల నుంచీ తిండిలేదు. అందుచేత ఈ పాపానికి ఒడిగట్టాను. నన్ను క్షమించి వదిలేశారంటే మళ్ళీ ఈ చాయలకు రాను," అన్నాడు దొంగ దీనంగా.

వర్తకుడు కొంచెం ఆలోచించి, "నీకు ఏదన్నా ఉద్యోగం ఇద్దామన్నా నువు బొత్తిగా అనమర్థుడివిగా కనబడుతున్నావే?" అన్నాడు.

"ఏమిటి, బాబూ? ఏం ఉద్యోగం?" అని అడిగాడు దొంగ ఆశతో.

"మరేమీలేదు. ఇలా, ఇంత తేలిగ్గా పట్టుబడిపోయే వాడివి నువ్వు నాకు గుర్రాలు ఏం తెచ్చిపెట్టగలవు?" అన్నాడు గుర్రాల వర్తకుడు. —మునీర్





# హృదయ ఫలకం

సుందరపూర్ యువరాజైన శీలకుమారుడు మారువేషంలో దేశాటన చేయటానికి బయలుదేరి, తన గుర్రం మీద ఆరు నెలల పాటు అనేక రాజ్యాలు చూసి, ఎన్నో విషయాలు నేర్చుకున్నాడు. తరవాత అతను తిరుగు ముఖం పట్టి, కొత్త దేశాలు చూసుకుంటూ స్వదేశానికి ప్రయాణమై, రాజపటం అనే రాజ్యానికి వచ్చాడు. అది చాలా అందమైన దేశం. అక్కడి భవనాలూ, కొలనులూ, వనాలూ, అతణ్ణి తన్మయుణ్ణిచేశాయి.

అతను నగరమంతా చూస్తూండగా అతనికి ఒక చోట ఎత్తయిన ప్రాకారం కనిపించింది. ప్రాకార ద్వారం వద్ద ద్వారపాలకులను అడిగితే, అది రాజకుమార్తె శాలిని సొంత ఉద్యానమనీ, అందులోకి పురుషులు ప్రవేశించరాదనీ చెప్పారు.

కాని శీలకుమారుడికి ఆ ఉద్యానం ఎలాగైనా చూడాలనిపించింది. అతను దాని చుట్టూ తిరిగి, ఉద్యానం వెనక భాగంలో ఉన్న ప్రాకారాన్ని లాఘవంతో ఎక్కి లోపలికి దూకాడు. అది నిజంగా దేవేంద్రుడి నందనవనాన్ని మించి ఉన్నది. శీలకుమారుడు అందులోని వింత వృక్షాలనూ, అంతకన్న విచిత్రమైన పూలనూ చూసి ఆనందిస్తూ కొంత సేపు విహరించాడు. చల్లని పిల్లగాలులు మోసుకువచ్చే సువాసనలు అతనికి మత్తు కలిగించసాగాయి. అతను ఒక చెట్టు నీడన కూర్చుని తన వేణువు తీసి వాయించనారంభించాడు. సమీపంలోనే ఒక పుట్టలో ఉండే తాచుపాము వచ్చి అతని ముందు పడగ విప్పి ఆడసాగింది. అతను దాన్ని చూడగానే వాయించటం మానేశాడు. మరుక్షణం ఆ పాము అతన్ని కాటు వేసి పారిపోయింది. కొద్ది క్షణాలలోనే అతని ముఖం నీలంగా మారిపోయింది. అతను స్పృహతప్పి పడిపోయాడు.

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



శీలకుమారుడు వేణువు వాయించటం ప్రారంభించగానే, ఆ ఉద్యానవనం మధ్య గల క్రీడాభవనంలో ఉన్న రాజకుమార్తె శాలిని, తనకు తెలియకుండా ఉద్యానంలో ఎవరు చేరారా అని ఆశ్చర్యపడుతూ శీలకుమారుడున్న చోటికి వచ్చింది.

ఆమె సమీపానికి చేరేసరికి రాజకుమారుడికి స్పృహలేదు. శాలిని అతనికి చికిత్స చేసి, స్పృహ తెప్పించి తన క్రీడాభవనానికి తీసుకుపోయి, అక్కడ రహస్యంగా నాలుగు రోజులపాటు ఉంచి కాపాడింది.

రాజకుమార్తె సొంత ఉద్యానంలో ప్రవేశించటం పెద్ద నేరం. రాజుకు గాని, ఇతరులకుగాని తెలిస్తే చాలా కఠినంగా శిక్షిస్తారు. అందుచేత, శాలిని అతన్ని రహస్యంగా తన క్రీడాభవనంలో ఉంచి, తన చెలికత్తెల చేత పరిచర్యలు చేయించవలసి వచ్చింది. అంతే కాక అతను ఒక దేశానికి యువరాజనీ, అతని బుద్ధి నిష్కళంకమైనదనీ గ్రహించిన మీదట శాలిని అతని పట్ల స్నేహభావం ప్రదర్శించింది. అతను అక్కడ ఉన్న నాలుగు రాజులలోనూ వారిద్దరి మధ్యా గాఢమైన స్నేహం ఏర్పడింది. వారిద్దరూ ఒకరినొకరు పెళ్ళాడటానికి కూడా ప్రమాణం చేసుకున్నారు.

శీలకుమారుడు రహస్యంగానే ఉద్యానవనం నుంచి బయటపడి, తన బసను చేరుకుని, తన గుర్రం మీద స్వదేశానికి తిరిగి వచ్చాడు.

రాజుగారు పుత్రుడి రాకకు ఎంతో సంతోషించి, మంత్రితో అతడి కోసం సంబంధాలు వెతకమని చెప్పాడు. శీలకుమారుడు తాను తనకు కాబోయే భార్యను ఇదివరకే ఎన్నుకున్నానని తండ్రితో చెప్పలేదు. అందుకు ఒక కారణం, అతనికి తండ్రి వద్ద ఏ మాత్రమూ చనువు లేదు. అంతకన్న ముఖ్యమైన విషయమేమంటే, తండ్రి శాలినిని ఏ కారణం చేతనైనా ఆమోదించకపోతే ఇక శీలకుమారుడు ఆమెను జన్మలో పెళ్ళాడలేడు.

ఈ కారణంగా, తన కోసం సంబంధాలు వెతుకుతున్నారని తెలియగానే శీలకుమారుడు

ఆహార నిద్రలు మానేసి కృశించసాగాడు. మంత్రిగారి కొడుకైన దేవదత్తుడు శీలకుమారుడికి మంచి స్నేహితుడు; శీలకుమారుడి మనోవేదనను అందరికన్న ముందు పసిగట్టినవాడు అతనే.

దేవదత్తుడు బతిమాలిన మీదట శీలకుమారుడు తన రహస్య ప్రణయగాథను అతనితో చెప్పేసి, తన అసహాయ స్థితిని వెలిబుచ్చాడు.

"నువ్వేమీ విచారించకు. తప్పనిసరి అయితే మన ఆస్థాన ఇంద్రజాలికుడి సహాయంతో నువు శాలినినే పెళ్ళాడే ఉపాయం ఆలోచిస్తాను," అని దేవదత్తుడు శీలకుమారుడికి అభయం ఇచ్చాడు.

త్వరలోనే అనేకమంది దేశాల రాజులు తమ తమ కుమార్తెలను శీలకుమారుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి తమ సమ్మతి తెలుపుతూ వర్తమానాలు పంపారు. అలా పంపిన వారిలో శాలిని తండ్రి కూడా ఉన్నాడు.

కాని రాజూ, మంత్రీ కూర్చుని ఎన్నిక చేసిన ముగ్గురు, నలుగురు రాజకుమార్తెలలో శాలిని లేదు. ఈ సంగతి తన తండ్రి అయిన మంత్రి నుంచి దేవదత్తుడు తెలుసుకున్నాడు. శీలకుమారుడి కోరిక నెరవేరాలంటే ఏదో ఇంద్రజాలం ప్రయోగించక తప్పదని అతనికి రూఢి అయింది.



రాజుగారు తాను నిర్ణయించిన రాజకుమార్తెల జాతకాలను దైవజ్ఞులకు చూపించి అంతిమ నిర్ణయానికి వద్దామన్నాడు మంత్రితో.

"మహారాజా, అంత కన్న మన యువరాజుగారి అభిప్రాయం తెలుసుకోవటం ముఖ్యం గదా?" అన్నాడు మంత్రి.

"నా నిర్ణయమే వాడి నిర్ణయం. వాడైపీ చెప్పడు," అన్నాడు రాజు. కొడుకును మొదటి నుంచీ ఆయన తన శాసనంలోనే ఉంచుతున్నాడు.

"అది కావచ్చు. కాని ఇది రాజకీయ విషయం కాదు. యువరాజుగారి సొంత విషయం. అతని జీవితానికి సంబంధించి



నది. అతన్ని అడగటానికి తమరు అనుమతించండి,'' అన్నాడు మంత్రి.

''అలాగే కానియ్యి,'' అన్నాడు రాజు.

దేవదత్తుడు శీలకుమారుడి వద్దకు వెళ్ళి, అతనికి చాలాసేపు బోధించి, అతన్ని తన తండ్రి వద్దకు తెచ్చాడు.

''నా హృదయ ఫలకం మీద ఎవతె ఉన్నదో తెలుసుకుని ఆమెను నా కిచ్చి వివాహం చెయ్యండి,'' అన్నాడు శీలకుమారుడు మంత్రితో.

''అది నీకేగదా తెలుస్తుంది? కనక నువు ఆమె పేరు చెబితే ఆమెకూ, నీకూ వివాహం జరిపించటానికి నేను శాయశక్తులా ప్రయత్నం చేస్తాను,'' అన్నాడు మంత్రి.

''నాకు తెలిస్తే నేనే చెబుదును కద! నాకు తెలియదు. అందుచేత మీరే కనుక్కోవాలి,'' అన్నాడు శీలకుమారుడు.

''అది సాధ్యమా, బాబూ?'' అన్నాడు మంత్రి హతాశుడై.

దేవదత్తుడు కలగజేసుకుని, ''ఇందుకు ఒక ప్రక్రియ ఉన్నదని మన మాయాధరుల వారు చెప్పినట్టు జ్ఞాపకం. ఆయనను అడుగుదామా?'' అన్నాడు.

మంత్రి ఆస్థాన ఐంద్రజాలికుడైన మాయాధరుణ్ణి పిలిపించి, సమస్య వివరించి చెప్పి, ''మన యువరాజుగారి హృదయఫలకం మీద ఉన్న ప్రేయసి ఎవరో అతనికే తెలియకపోతే పై వాళ్ళు తెలుసుకోవటం సాధ్యమా?'' అని అడిగాడు.

మాయాధరుడు చిరునవ్వు నవ్వి, ''అందుకొక యోగ సంబంధమైన ప్రక్రియ ఉన్నది. ఒక రాత్రి అంతా యువరాజును మా ఇంట యోగసమాధిలో ఉంచినట్టయితే, బహిరంగసభలో అందరి సమక్షాన అతని హృదయ రహస్యాన్ని అతనికీ, లోకానికీ కూడా స్పష్టమయేటట్టు చేయగలను. కాని అటు తరవాత అతనికి ఆ ప్రేయసితో వివాహం జరిగి తీరవలసి ఉంటుంది. లేని పక్షంలో అతనికి ఉన్మాదం కలగవచ్చు, అతను ఏ పనికీ అర్హుడు కాకుండా పోవచ్చు. మీరూ, రాజుగారూ ఇందుకు ఒప్పుకుంటే

నేను నా యోగశక్తిని ప్రయోగించటానికి సిద్ధంగా ఉన్నాను." అన్నాడు.

మంత్రి ఈ సంగతి చెప్పేసరికి రాజుకు ఆశ్చర్యమూ, అనుమానమూ కూడా కలిగాయి. తన కుమారుడి పెళ్ళి మాట ఏమైనా, ఈ యోగ విద్యను కళ్ళారా చూడాలన్న ఉద్దేశంతో ఆయన యోగ ప్రక్రియకు అనుమతించాడు.

ఒక రాత్రంతా శీలకుమారుడు ఇంద్రజాలికుడి ఇంటనే గడిపాడు. మర్నాడు అతన్ని నిండు కొలువుకు తెచ్చారు. మంత్రి రాజకుమార్తెల పేర్లు అన్నీ ఒక కాగితం మీద రాసి, సభికులు వినేటట్టుగా పెద్దగా చదివి, ఆ కాగితాన్ని ఇంద్రజాలికుడికి అందించాడు..

ఇంద్రజాలికుడు ఆ కాగితాన్ని భద్రంగా ఒక పళ్ళెంలో కాల్చి నుసి చేసి, ఆ బూడిదను జాగ్రత్తగా తన చేతిలోకి తీసుకుని, యువరాజును అంగీ విప్పమన్నాడు. తరవాత ఆయన, నగ్నంగా ఉన్న శీలకుమారుడి ఛాతీ పైన కాగితం మసిని రుద్దాడు. త్వరలోనే యువరాజు హృదయం ప్రాంతంలో "శాలిని" అనే అక్షరాలు కొట్టవచ్చినట్టు కనిపించాయి. అందరూ ఆశ్చర్య సంభ్రమాలు చెందుతూ, హాహాకారాలు చేశారు.

"మిగిలిన తంతు మీరు జరిపించండి," అని మంత్రికి చెప్పి, మాయాధరుడు తన ఆసనంలో కూర్చున్నాడు.

రాజు తన కుమారుడికి శాలినితో వివాహం జరిపి తన మాట నిలబెట్టుకున్నాడు. వివాహం జరిగిన నాటి రాత్రి శీలకుమారుడు శాలినికి ఒక సబ్బు బహూకరించాడు.

"ఇదేం బహుమానం? ఇంత కన్న విలవైనది దొరకలేదా?" అన్నది శాలిని.

"ఈ సబ్బు సహాయంతోనే నేను నిన్ను పెళ్ళాడగలిగాను. మాయాధరుడు సబ్బుతో నా గుండె మీద నీ పేరు రాసి, దాని మీద మసి పూసి, అదృశ్యంగా ఉన్న నీ పేరు లోకానికి తెలియజేసి, యోగప్రక్రియ అని నమ్మించకపోతే, మా తండ్రి నిన్ను నాకు చేసుకుని ఉండడు!" అన్నాడు శీలకుమారుడు.



# పందెం

కాంచనపురరాజు మహా ధర్మాత్ముడు. రాజులాగే ప్రజలు కూడా చాలా ధర్మాత్ములు. రాజుకు సంతానం లేదు. అందుకు ఆయనతోపాటు ప్రజలు కూడా చాలా బాధపడేవారు.

అనేకమంది ధర్మాత్ముల మధ్య ఒక దుర్మార్గుడు లాభం పొందుతాడు. అలాటి దుర్మార్గుడు ఒక వర్తకుడు రాజధానిలో ఉండేవాడు.

ఆ వర్తకుడు ఒకనాడు తన పొరుగున ఉన్న ఒక పేదవాడితో, "నాకొక మాంత్రికుడు తెలుసు. ఆయన నీ మనసులో ఉన్నది చెప్పగలడు. పది వరహా లిచ్చావంటే నిన్ను ఆయన దగ్గిరికి తీసుకుపోతాను," అన్నాడు.

"దీనికి మాంత్రికుడు కావాలా? నీ మనసులో ఏమనుకుంటున్నావో నేనే చెప్పగలను," అన్నాడు పేదవాడు.

"పందెం కడతావా?" అన్నాడు వర్తకుడు.

"నేను నీ మనసులో ఉన్నది చెప్పలేకపోతే నా కున్నదంతా నీ కిస్తాను. చెప్పగలిగితే నీ కున్నదంతా నా కిస్తావా?" అన్నాడు పేదవాడు. సరేనన్నాడు వర్తకుడు.

"మనకు మధ్యవర్తి కావాలి. రాజుగారి దగ్గిరికి పోదాం పద," అన్నాడు పేదవాడు.

ఇద్దరూ రాజుగారి దగ్గిరికి వెళ్ళి, తమ పందెం మాట చెప్పారు.

"రాజుగారికి సంతానం కలగాలని అనుకుంటున్నావు. అవునా?" అన్నాడు పేదవాడు.

నిజమేనని ఒప్పుకుని వర్తకుడు తన కున్నదంతా పేదవాడికి ఇచ్చేశాడు.

—(శ్రీమతి) పి. వి. శామ్సన్






పాండవులూ, ద్రౌపదీ విరాటరాజు వద్ద గుట్టుగా అజ్ఞాతవాసం చేస్తున్నారు. ధర్మ రాజు పాచికలాటలో డబ్బు గెలిచి తన తమ్ములకు పంచి పెట్టేవాడు. భీముడు తాను వండిన రకరకాల మాంసాలు మిగిలిన వారికి ఇచ్చేవాడు. అర్జునుడు అంతః పురంలో తనకు లభించే పాత బట్టలను అందరికీ చేర్చేవాడు. నకులుడు తన అశ్వ పోషణకు మెచ్చి రాజు ఇచ్చే బహుమానా లను మిగిలిన వారికి పంచేవాడు. సహ దేవుడు పాలూ, పెరుగూ అందించేవాడు. ద్రౌపది తన భర్తలందరినీ కనిపెట్టుతూ తన రహస్యం బయట పడకుండా మసలు కుంటున్నది. తమ ఆచూకీ దుర్యోధనుడికి తెలిసిపోతుందన్న భయం అందరికీ ఉన్నది.

ఇలా నాలుగు మాసాలు గడిచింది. అప్పుడు మత్స్యదేశంలో బ్రహ్మోత్సవం జరిగింది. ఆ ఉత్సవానికి దేశదేశాల నుండి మల్లులు వచ్చారు. విరాటరాజుకు మల్ల యుద్ధం గురించి బాగా తెలుసు. అందుచేత ఆయన మల్లవీరులకు చక్కని సౌకర్యాలు కలిగించి, వారి మధ్య యుద్ధాలు ఏర్పాటు చేసి చూసి ఆనందిస్తూ వచ్చాడు.

అలా వచ్చిన మల్లులలో జీమూతు డనే వాడు మహా బలశాలి. వాడు అందరినీ తనతో యుద్ధం చెయ్యమని పిలిచేవాడు. మిగిలిన మల్లులు వాడితో యుద్ధం చెయ్య టానికి భయపడ్డారు. అందుచేత విరాటుడు తన వంట వాడుగా ఉంటున్న భీముణ్ణి పిలిచి, జీమూతుడితో మల్లయుద్ధం చెయ్య

39. కీచకుడి విజృంభణ



మన్నాడు. రాజు ఆజ్ఞాపిస్తే కాదనటం బాగుండదని భీముడు సమ్మతించాడు.

భీముడూ, జీమూతుడూ రెండు మదపు ఏనుగుల లాగా మల్లయుద్ధం ప్రారంభించారు. మహా దారుణమైన వారి యుద్ధం చూసి ప్రేక్షకులు పరమానందం చెందారు. భీముడు జీమూతుణ్ణి పట్టుకుని గిరగిరా తిప్పేసరికి మిగిలిన మల్లులు దిగ్భ్రమ చెందారు. భీముడు జీమూతుణ్ణి అలా తిప్పి, తిప్పి నేల కేసి కొట్టి, చంపేశాడు. జీమూతుణ్ణి జయించిన భీముడికి విరాటుడు అంతులేని ధనం కానుక ఇచ్చాడు.

భీముడి శక్తి సామర్థ్యాలు చూసి రాజు అతనిని మల్లులతోనే గాక, సింహాలతోనూ, ఏనుగులతోనూ, పులులతోనూ పోట్లాడించి వినోదించేవాడు. ఈ పోరాటాలు చూడటానికి అంతఃపుర స్త్రీలు కూడా వచ్చేవారు.

అర్జునుడు అంతఃపుర స్త్రీల చేత పాటలు పాడించి, నాట్యాలు చేయించి రాజుకు ఆనందం కలిగించేవాడు. పొగరుబోతు గుర్రాలను అధీనంలోకి తెచ్చి, వాటికి కళ్ళాలు తగిలించి, రాజుకు చూపి నకులుడు చాలా ధనం బహుమానంగా పొందాడు. అలాగే సహదేవుడు పొగరైన ఆబోతులను మచ్చిక చేసి బహుమతులు సంపాదించాడు. తన భర్తలు రాజు కొలువులో పడే పాట్లుచూసి ద్రౌపది బాధ పడేది.

ఈ విధంగా పాండవుల అజ్ఞాతవాసం దాదాపు ఏడాది పూర్తికావచ్చింది. ఆ సమయంలో ద్రౌపది పాలిటికి సింహబలుడు అనే కీచకుడు దాపరించాడు. ఈ కీచకుడు విరాటరాజు బావమరిదీ, సేనాపతి కూడానూ. అతను సుధేష్ణ ఇంట ద్రౌపదిని చూసి మోహపరవశుడై, తన చెల్లెలితో, "నేనీమెను ఇక్కడ ఇది వరకు చూడలేదు. ఈమె అందం నన్ను సమ్మోహితుణ్ణి చేస్తున్నది. ఈమె ఎవరు? అప్సరసలాటి రూపం గల ఈమె ఎక్కడి నుంచి వచ్చింది? ఇంత సౌందర్యవతి చేత చాకిరీ చేయించడమేమిటి? ఈమె నా యింటికి వస్తే పువ్వుల్లో పెట్టి పూజిస్తాను," అన్నాడు.



అతను సుధేష్ణ వద్ద సెలవు పుచ్చుకుని, ద్రౌపది ఒంటరిగా ఉన్నప్పుడు ఆమెకు తన కోరిక తెలిపాడు.

ద్రౌపది అతనితో, "నాతో ఇలా మాట్లాడటం తప్పు. నేను మరొకరి భార్యను. నన్ను కోరటం నీకు కీడు," అన్నది.

"నన్ను అలా తోసి పుచ్చకు. తరవాత పశ్చాత్తాప పడగలవు. ఈ రాజుకూ, రాజ్యానికీ నేనే ఆధారం. భోగ భాగ్యాలలోనూ, రూపంలోనూ, యౌవనంలోనూ నన్ను మించిన వాళ్ళు ఈ లోకంలో లేరు. అలాటి నన్ను నీ సేవకుడుగా చేసుకుని వివిధ భోగాలు అనుభవించక దాసిగా ఎందుకు పని చేస్తావు?" అన్నాడు కీచకుడు.

ద్రౌపది మండి పడి, "నా మీద మోహం విడిచి పెట్టక పోయావో నీ ప్రాణాలకు అపాయం ఉన్నది. నా భర్తలైన అయిదుగురు గంధర్వులు నన్ను అహర్నిశలు కని పెట్టి ఉంటారు. వారికి నీ సంగతి తెలిస్తే నీకు చావు తప్పదు. వారి నుంచి నిన్ను ఎవరూ కాపాడే వాళ్ళు లేరు," అన్నది.

ద్రౌపది ఈ మాటలు అన్నా కూడా కీచకుడు నిరుత్సాహ పడలేదు. అతనికి ఆమె మీది మోహం అంతకంతకూ ఎక్కువ కాసాగింది. అతను మళ్ళా సుధేష్ణ వద్దకు వెళ్ళి, "ఎలాగైనా సైరంధ్రిని నాకు దక్కేటట్టు చేయక పోయావో, నా ప్రాణాలు నిశ్చయంగా పోతాయి. నేను ఎన్ని రకాల ప్రార్థించినా ఆమె మనసు నా కేసి మరలటం లేదు," అన్నాడు.

సుధేష్ణ అన్న దుస్థితి చూసి చాలా బాధ పడి, "సైరంధ్రి నాకు ఆశ్రితురాలు. ఆమెను రక్షిస్తానని నేను మాట ఇచ్చాను. తనకు అయిదుగురు గంధర్వులు భర్తలని ఆమె మొదటనే చెప్పింది. అన్నవు గనక ఈ రహస్యం నీకు చెప్పాను. సైరంధ్రి మీద భ్రమ పెట్టుకుని ప్రాణాపాయం తెచ్చుకోకు," అన్నది.

"వెయ్యిమంది గంధర్వులు కూడా నన్నేమీ చెయ్యలేరు. నా వంటి అందగాణ్ణి ఎంతటి పతివ్రత అయినా కోరుతుంది.

నా వైభవం చూసి సైరంధ్రి మనసు నా మీదికి తప్పక తిరుగుతుంది. ఎలాగైనా ఆమెను నాకు అనుకూలవతిని చేసి నా ప్రాణాలు నిలబెట్టు," అంటూ కీచకుడు తన చెల్లెలిని బతిమాలసాగాడు.

"ఓరీ, పాపీ! నువు కూడని పని తల పెట్టటమే గాక అందుకు నన్ను సాధనంగా ఉపయోగించుకో జూస్తున్నావు. నీ పాపం నీతో పోదు, కులాన్నే నాశనం చేస్తుంది. నువు ఇంటికి వెళ్ళి, కల్లూ, మధురాన్నమూ సిద్ధం చేయించి ఉంచు. వాటిని తీసుకు రావటానికి సైరంధ్రిని పంపుతాను. ఆమెను ఎలా లోబరుచుకుంటావో!" అన్నది సుధేష్ణ.

కీచకుడు వెంటనే తన యింటికి వెళ్ళి, భక్ష్య భోజ్య పానీయాలు తయారు చేయించి, ద్రౌపది కోసం చూడసాగాడు.

తరవాత సుధేష్ణ ద్రౌపదితో, "సైరంధ్రీ, నాకు చాలా దాహంగా ఉన్నది. నువు కీచకుడి ఇంటికి వెళ్ళి, తాగటానికి ఏమైనా తీసుకురా," అని ఆజ్ఞాపించింది.

"అమ్మా, నేను అతని ఇంటికి వెళ్ళలేను. అతను కామోద్రేకంతో కొట్టుకు పోతున్న సంగతి నీకు తెలుసు గదా. నేను వెళ్ళితే అతను తప్పక నన్ను అవమాన పరుస్తాడు. నీ వద్ద ఇంకా ఎందరో పరిచారికలున్నారు. వారిలో ఎవరినైనా పంపు," అన్నది ద్రౌపది.



"కల్లు తెమ్మని నేనై పంపుతూంటే, వాడు నిన్ను తాకగలడా?" అంటూ సుధేష్ణ ద్రౌపదికి ఒక బంగారు పాత్ర ఇచ్చింది.

గత్యంతరం లేక ఆ పాత్ర తీసుకుని ద్రౌపది కీచకుడి ఇంటికి వెళ్ళింది. ఆమెను చూస్తూనే కీచకుడు పరమానందంతో లేచి, "సుందరీ, నీకు స్వాగతం. నా ప్రాణేశ్వరివైన నువు నా దగ్గిరికి వచ్చావు. నా కోరిక తీర్చు. దివ్యాంబరాలు ధరించు, రత్నాలంకారాలు అలంకరించుకో. నాతో కలిసి తాగి, సుఖంగా ఉండు." అన్నాడు.

"రాణిగారు కల్లు తెమ్మని పంపింది. ఆమెకు చాలా దాహంగా ఉన్నదట. వెంటనే కల్లు ఇప్పిస్తే నేను పోతాను," అన్నది ద్రౌపది.



"కల్లు మరొకతె చేత పంపిస్తాలే," అంటూ కీచకుడు ఆమె చేతిని పట్టుకున్నాడు.

ద్రౌపది కంగారు పడుతూ కీచకుణ్ణి ఒక్క తోపుతో పడదోసి, పరిగెత్తుకుంటూ విరాటరాజు సభలో ప్రవేశించింది. కీచకుడు ఆమె వెంట పడి, విరాటరాజు చూస్తూండగానే జుట్టు పట్టుకుని ఆపాడు.

ఈ దురన్యాయాన్ని ధర్మరాజూ, భీముడూ సభలో ఉండి కళ్ళారా చూశారు. భీముడికి ఆ క్షణంలోనే కీచకుణ్ణి చంపాలనిపించి, పళ్ళు పట పటా కొరికాడు. అతని శరీరమంతా చెమట పట్టింది. కళ్ళ నిప్పులు రాలాయి. ఎదురుగా కనబడే చెట్టును పీకే ఉద్దేశంతో అతను లేచాడు.

ధర్మరాజు భీముడి కాలి బొటన వేలిని తన బొటన వేలితో నొక్కి, "ఏమోయ్, కట్టెల కోసం ఈ చెట్టును ఎందుకు పడగొడతావు? అవతల ఇంకా చాలా చెట్లున్నాయి. వాటిని పడగొట్టు," అన్నాడు.

ఈలోపల ద్రౌపది తన భర్తల అశక్తత గ్రహించి, చుర చురా చూస్తూ విరాటుడికేసి తిరిగి, "ఈ నీచుడు నన్నిలా అవమానిస్తూ ఉంటే మహా బలులైన నా భర్తలు, గంధర్వులు, కాలానికి కట్టుపడి నన్ను కాపాడలేని స్థితిలో ఉన్నారు. అలాటప్పుడు రాజువైన నీవైనా రక్షకుడివై, మానభంగం కలగకుండా చూడడానికి బదులు ఉపేక్షిస్తావా?" అని సభలో వారితో, "రాజుకూ, కీచకుడికి లాగే మీకు కూడా ధర్మం తెలియదు లాగుంది," అన్నది.

అప్పుడు విరాటరాజు, "ఏమమ్మా, మీ ఇద్దరికీ పరోక్షంగా ఏమి తగాదా వచ్చినదీ తెలియకుండా నేను ఎలా మీ మధ్య ధర్మ నిర్ణయం చెయ్యగలను?" అని ద్రౌపదితో అన్నాడు.

అప్పుడు ధర్మరాజు ద్రౌపదితో, "ఓసీ, నువు ఇక్కడ తారట్లాడక అంతఃపురానికి పో. నీ భర్తలు ఏమీ చెయ్యకపోతే దానికి కారణం ఉండే ఉంటుంది. దేశమూ, కాలమూ ఆలోచించకుండా ఇక్కడ శోకాలు పెట్టి రాజ సభలో ఎందుకు గల్లంతు చేస్తావు?

నీకు అపకారం చేసిన వారిని నీ భర్తలే దండిస్తారులే," అన్నాడు.

ద్రౌపది సుధేష్ణ మందిరానికి తిరిగిపోయి, జుట్టు విరబోసుకుని, శోక దేవతలాగా కూర్చున్నది. ఆమె అవతారం చూసి సుధేష్ణ, "మాలినీ, ఎవరు నీకు కష్టం కలిగించారు?" అని అడిగింది.

"నువు కల్లు తెమ్మని పంపిస్తే కీచకుడు నన్ను బాధించి, నిండు సభలో పరాభవించాడు. ఇలా చెయ్యటం వల్ల ఎవరికి రోషం వస్తుందో వాళ్ళే అతని అంతు చూస్తారు," అన్నది ద్రౌపది.

నిజంగా కీచకుణ్ణి చంపించటానికే ఆమె నిశ్చయించుకున్నది. ఆమె తన ఇంటికి వెళ్ళి, స్నానం చేసి, బట్టలు ఉతికేసి, తన కోరిక తీర్చగలవాడు భీముడు ఒకడే నని నిశ్చయించుకున్నది. ఆమె రాత్రి వేళ భీముడుండే ఇంటికి వెళ్ళింది. భీముడు బుసలు కొట్టుతూ గాఢ నిద్రలో ఉన్నాడు. ద్రౌపది అతని వద్దకు వెళ్ళి, గట్టిగా కౌగలించుకుని, "చచ్చిపోయిన వాడిలాగా ఇలా చలనం లేకుండా ఉన్నావేం? బతికున్నవాడు తన భార్యను ఎవడన్నా ఇలా నిండు సభలో అవమానం చేస్తే ఊరుకుంటాడా? లే, లే!" అన్నది.

భీముడు మేలుకుని పక్క మీది నుంచి లేచి, "ఏమిటి ఇలా పాలిపోయి, చిన్న



బోయి ఉన్నావు? ఇక్కడి కెందుకు వచ్చావు? నా వల్ల కావలిసిన పని ఉంటే చెప్పి, ఎవరికీ తెలియకుండా వెళ్ళి పడుకో," అన్నాడు.

"అన్నీ తెలిసి నన్నెందు కిలా అడుగుతున్నావు? మీ అన్న జూదగాడు కావటంతో నాకు ఇన్నిపాట్లు వచ్చాయి. నేను ఈ విరాటుడి భార్య దగ్గిర సేవలు చేస్తూ ఉండటమే గాక కీచకుడు నా వెంటబడి నాకు సహించరాని అవమానం చేశాడు. నాకు ఆ విరాటరాజు ఏమంటాడోనన్న భయం కూడా ఉన్నది. చాకిరి చేసి చేసి నా చేతులు ఎలా మొరటు దేలాయో చూడు," అంటూ ద్రౌపది భీముడికి తన చేతులు చూపింది.

భీముడు ఆమెతో, "ఆ కీచకుడు నిన్ను సభలో కాలితో తన్నినప్పుడు వాణ్ణి అక్కడే చంపేద్దామనుకున్నాను గాని, ధర్మరాజు వారించాడు. అసలు ఆ రోజే దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనుల తలలు పగల గొట్టకపోతినే! కొద్ది రోజులు ఓర్చు కున్నా వంటే తిరిగి నువు మహారాణివి అవు తావు." అన్నాడు.

"ఈ దుఃఖం భరించటం నా వల్ల కాదు. నేను తిరిగి రాణిని కావటం అబద్ధం. ఈ కబుర్లన్నీ దేనికి? ఇప్పుడు జరిగిన దానికి ప్రతీకార మార్గం ఆలోచించు. సుధేష్ణ కన్న నేను బాగుంటానని విరాటుడు చూస్తున్నాడు. అది తెలిసి కీచకుడు నా వెంట పడ్డాడు. నాకు అయిదుగురు గంధర్వులు భర్తలున్నారనీ, వాళ్ళు ప్రాణాలు తీస్తారనీ మంచిగా చెప్పి చూశాను. కాని వాడు నా మాట లక్ష్యపెట్టడు. సుధేష్ణ వాడికి సహాయం వచ్చి, కల్లు తెమ్మని నన్ను వాడి ఇంటికి పంపింది. వాడు నన్ను పట్టుకోబోయాడు. నేను పారిపోయి వచ్చి రాజభవనంలో దూరాను. అందరూ చూస్తుం డగా ఆ దుర్మార్గుడు నన్ను కాలితో తన్నాడు. ఈ దుర్మార్గుణ్ణి నువు కుండను పగలగొట్టి నట్టు ధ్వంసం చెయ్యకపోతే నేను విషం తాగి చస్తాను," అంటూ భీముణ్ణి గట్టిగా కౌగలించుకుని ఏడ్చింది ద్రౌపది.

భీముడు ఆమెను గట్టిగా పట్టుకుని, కన్నీరు తుడుస్తూ ఓదార్చి, "నువు చెప్పి నట్టే వాణ్ణి చంపేస్తాను. దానికి నువు ఒక పని చెయ్యాలి. ఇలా ఏడుపు మొహంతో కాకుండా, నవ్వుతూ కళకళలాడే మొహంతో కీచకుణ్ణి కలుసుకుని, వాడి కోరిక తీర్చే దానిలాగా అభినయించు. నర్తనశాలలో పగలు స్త్రీలు ఆడుతారు, పాడుతారు. రాత్రి వేళ అక్కడ ఎవరూ ఉండరు. అక్కడ ఒక మంచం కూడా ఉన్నది. రాత్రికి అక్కడికి వాణ్ణి రమ్మను. మూడో కంటి వాడికి తెలియకుండా అక్కడ కీచకుణ్ణి వాడి తాతల వద్దకు పంపుతాను," అన్నాడు.

ఇలా మంత్రాలోచన చేస్తూ వాళ్ళు ఆ రాత్రి గడిపారు.






# శివపురాణం

## 16

బ్రహ్మ తారకుడి కొడుకుల తపస్సుకు మెచ్చి, ప్రత్యక్షమై, "మీకు ఏమి వరాలు కావాలి?" అని అడిగాడు.

"దేవా, రథం కాని రథం మీద, విల్లు కాని విల్లుకు, బాణం కాని బాణం సంధించి కొడితే తప్ప మాకు చావు లేకుండా అనుగ్రహించు. మాకు సకల విద్యలూ, తేజో బలాలూ, ఐశ్వర్య త్యాగ భోగ భాగ్యాలూ, శివభక్తి, బంగారమూ, వెండీ, ఇనుములతో చేసిన పురాలు నివసించటానికి కావాలి," అన్నారు ఆ ముగ్గురూ.

బ్రహ్మ వారు కోరిన పరాలిచ్చి, వారికి కావలసిన పురాలను నిర్మించి పెట్టే పని విశ్వకర్మకు అప్పగించి, అదృశ్యుడయాడు.

విశ్వకర్మ బంగారంతోనూ, వెండితోనూ, ఇనుముతోనూ మూడు పురాలు నిర్మించి తారకుడి కొడుకులకు ఇచ్చాడు. అవే త్రిపురాలు. వాటికి కామగమనం ఉండేది. అవి ఆకాశంలో నిలిచి ఉండేవి. వాటిలో ఇళ్ళూ, చెట్లూ, చెరువులూ, ధన ధాన్య సమృద్ధీ ఉండేవి. బంగారంతో చేసిన పురంలో తారకాక్షుడూ, వెండి దానిలో కమలాక్షుడూ, ఇనుప దానిలో విద్యున్మాలీ నివాసాలు ఏర్పరచుకుని, వాటితో మూడు లోకాలూ స్వేచ్ఛగా తిరగసాగారు.

ఈ త్రిపురాలను జయించటం ఇంద్రుడు మొదలుగాగల దేవతలకు సాధ్యం కాలేదు. వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, "త్రిపురాసురులు మమ్మల్ని చాలా బాధపెట్టుతున్నారు. వాళ్ళ నగరాలు మా ఇళ్ళ మీద వాలి, వాటిని నేలమట్టం చేస్తున్నా..." అని మొరపెట్టుకున్నారు.

"త్రిపురాసురులు తేలికగా చావరు. మనం శివుడి సలహా అడుగుదాం," అని

అట్ట చివరి బొమ్మ



బ్రహ్మ దేవతలను వెంట బెట్టుకుని శివుడి వద్దకు వెళ్ళారు.

శివుడు వారు వచ్చిన పని తెలిసి, "త్రిపురాసురులను నేను చంపను, కావలిస్తే నా తేజస్సు సగం యిస్తాను. మీరే వాళ్ళను చంపండి," అన్నాడు.

త్రిపురాసురులకు తాను ఇచ్చిన వరాలు చెప్పి బ్రహ్మ, "మా తేజస్సు కూడా తీసుకుని నువే వారిని చంపాలి." అన్నాడు. రథంగాని రథమూ, విల్లు కాని విల్లూ, బాణం కాని బాణమూ కావలిసి ఉన్నది. అందుచేత శివుడు భూమిని రథంగానూ, వేదాలను రథాశ్వాలుగానూ, సూర్య చంద్రులను రథ చక్రాలుగానూ, మేరువును విల్లుగానూ, ఆదిశేషుణ్ణి వింటి తాడుగానూ చేసుకుని, విష్ణుమూర్తిని నారాయణాస్త్రంగా ఉపయోగించి, త్రిపురాలను కొట్టాడు. వెంటనే ఆ మూడు పురాలూ బూడిద అయి భూమి మీద రాలిపోయాయి.

త్రిపురాసురులు నాశనం కాగా జలంధరుడనే మరొక రాక్షసుడు బయలుదేరి లోకాలను పీడించసాగాడు. జలంధరుడి అసలు పేరు సూకరుడు. అతను హిరణ్యకశిపుడి పదవ కొడుకైన అగ్నిజిహ్వుడి కుమారుడు; బ్రహ్మను గురించి అతి ఘోరమైన తపస్సు చేసి, దేవగణాల చేతగాని, రాక్షస గణాల చేతగాని, నాగులూ, మానవులూ మొదలైన వారిచేతగాని చావు లేకుండానూ, నీటి లోపల నివసించేలాగూనూ వరాలు పొంది, అష్టదిక్కులూ గెలిచి, దేవేంద్రుడు మొదలైన వారిని స్వర్గం నుంచి పారదోలి, స్వర్గాన్ని ఆక్రమించుకుని మూడు లోకాలూ పాలించసాగాడు.

జలంధరుడికి ఓడి, కైలాసం నుంచి శివుడూ, వైకుంఠం నుంచి విష్ణువూ పారిపోయి, ఇద్దరూ మానససరస్సులో దాక్కున్నారు. అక్కడ వాళ్ళిద్దరూ కూడబలుక్కుని, పరబ్రహ్మను గురించి తపస్సు చేయగా పరబ్రహ్మ స్వరూపుడు ప్రత్యక్షమై, విష్ణువుకు చక్రమూ, శివుడికి త్రిశూలమూ ఇచ్చి, "మీరు ఒకరి ఆయుధాలు

మరొకరు పుచ్చుకుని జలంధరుణ్ణి చంపండి,'' అని హెచ్చరించి అదృశ్యుడయిపోయాడు.

శివ విష్ణువులు సంతోషించి, తమ ఆయుధాలు మార్చుకుని, జలంధరుడి కోసం చూడసాగారు.

అప్పుడు నారదుడు ఈ సంగతి తెలుసుకుని, జలంధరుడి వద్దకు వెళ్ళి, ''జలంధరా, శివ విష్ణువులు మానస సరస్సులో దాక్కుని ఉన్నారు.'' అని చెప్పాడు.

జలంధరుడు వెంటనే మానస సరస్సు చేరి, నీటిలో మునిగి శివ విష్ణువుల కోసం వెతకనారంభించాడు. ఈ సంగతి పసికట్టి శివుడూ, విష్ణువూ ఒడ్డుకు వచ్చి, జలంధరుడు ఎప్పుడు పైకి వస్తాడా అని చూశారు. శివుడి చేతిలో చక్రమూ, విష్ణువు చేతిలో త్రిశూలమూ ఉన్నాయి.

మానస సరస్సు అంతా కలయ వెతికి శివ విష్ణువులను కానక, జలంధరుడు ఒడ్డుకు వచ్చాడు. అప్పుడతనికి వారిద్దరూ కనబడ్డారు. జలంధరుడు వారు కనబడగానే సంతోషించి, వారితో యుద్ధానికి కలియబడ్డాడు. వారిద్దరూ జలంధరుణ్ణి రెండు ఖండాలు చేసి చంపేశారు. జలంధరుడి చావుకు మూడు లోకాలవాళ్ళూ సంతోషించారు.

కశ్యప ప్రజాపతి కన్న కొడుకులలో విప్రజిత్తు అనే దానవుడు ఒకడు ఉండేవాడు. ఆ విప్రజిత్తుకు దంభుడు అనే కొడుకు ఉండేవాడు. దంభుడు విష్ణు



భక్తుడు. ఎప్పుడూ విష్ణుపూజ చేసేవాడు. దంభుడికి చాలా కాలం సంతానం లేక పోయింది. అందుచేత అతను బదరికాశ్రమానికి వెళ్ళి, విష్ణువును గురించి దీర్ఘ కాలం ఘోరమైన తపస్సు చేశాడు.

చివరకు విష్ణువు ప్రత్యక్షమై, దంభుణ్ణి వరం కోరమన్నాడు.

"మహావిష్ణూ, బలశౌర్య పరాక్రమాలలో నీకు సముడైన వాడూ, మూడు లోకాలనూ జయించగల వాడూ, ఎవరికీ ఓడని వాడూ, నీ యందు భక్తి గల వాడూ అయిన కొడుకును ప్రసాదించు." అని దంభుడు విష్ణువును కోరాడు.

విష్ణువు దంభుడు కోరిన వరం ఇచ్చాడు. దంభుడు ఇంటికి తిరిగి వెళ్ళి ఈ శుభ వార్త తన భార్యకు చెప్పాడు. తరవాత కొంత కాలానికి దంభుడి భార్య గర్భవతి అయి, మంచి ముహూర్తాన కొడుకును కన్నది. ఆ పిల్లవాడికి శంఖచూడుడు అని పేరు పెట్టుకుని తల్లిదండ్రులు అమితగారాబంగా పెంచారు.

శంఖచూడుడు కాలక్రమాన శుక్రాచార్యుల వద్ద సకల విద్యలూ నేర్చుకుని, పెద్దవాడయాక తల్లిదండ్రుల అనుమతితో వింధ్యపర్వతానికి వెళ్ళి, అక్కడ బ్రహ్మను గురించి అతి దీర్ఘమైన తపస్సు చేశాడు. నిరాహారుడై, ఒంటి కాలిపై నిలబడి శంఖచూడుడు చేస్తున్న తపస్సుకు బ్రహ్మ సంతోషించి, అతని ఎదట ప్రత్యక్షమై, "నాయనా, వరం కోరుకో," అన్నాడు.

"దేవా, నేను దేవ, రాక్షస, నాగ, మానవ గణాలను జయించే బలపరాక్రమాలను పొందాలి; మూడు లోకాలనూ జయించి పరిపాలించాలి; సకల భోగాలూ అనుభవించాలి. ఇదే నా కోరిక," అన్నాడు శంఖచూడుడు.

బ్రహ్మదేవుడు అతను కోరినట్టు వరం ఇస్తూ, "నాయనా, నువు బదరికాశ్రమానికి వెళ్ళు. అక్కడ తులసి అనే కన్య తపస్సు చేసుకుంటూ కనిపిస్తుంది. నువు ఆమెను పెళ్ళాడి సుఖంగా ఉండు," అని చెప్పి అదృశ్యుడయాడు.



# 126. కణుజుల పెంపకం

సోవియెట్ రష్యాలో మాస్కో నగరానికి ఈశాన్యంగా "కస్త్రోమ" ప్రయోగ వ్యవసాయ క్షేత్రం వారు కణుజుల మందను పెంపకం చేస్తున్నారు. ఇక్కడ కణుజులను మచ్చిక చేసి, వాటి జీవితాన్నీ, అలవాట్లనూ పరిశీలిస్తున్నారు. ఆడ కనుజులను పాలు పితకటానికి అలవాటు చేస్తున్నారు. కణుజు పాలలో కొవ్వు పదార్థం ఆవు పాలలో కన్న మూడింతలుంటుంది. కణుజు పాలు అమిత చిక్కగా ఉండటమేగాక మంచి సువాసన కలిగి ఉంటాయి. ఈ పాలను చిలకకుండానే వెన్న తీయవచ్చు.

ఇక్కడ పెరిగే కణుజులు అడవి ప్రాంతంలో స్వేచ్ఛగా తిరుగుతాయి. వాటికోసం భారీ ఎత్తున ఇళ్ళు అవసరంలేదు. పాకలూ, కంచెలూ మాత్రమే ఏర్పాటు చేశారు. అవి ఏపుగా పెరిగి, సంఖ్యలో వృద్ధి అవుతున్నాయి. పూర్తిగా పెరిగిన కణుజు బరువు 4 లేక 5 వందల కిలోలదాకా ఉంటుంది. అవి సహజంగా అడవిలో దొరికే గడ్డి, గాదా తిని బతకగలవు. ఇక్కడ పెంపకంలో ఉన్న కణుజులకు అదనంగా కాయగూరలూ, చొప్పా కూడా మేపుతున్నారు. వీటి నుంచి మేలు రకం మాంసమూ, పాలూ, కొవ్వూ, కొమ్ములూ, చక్కని చర్మమూ లభిస్తాయి.



Photo by R. B. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

మాను వంగినది

పంపినవారు :
ఖతీజా బేగం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు మే నెల 20 వ తేదిలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూలై నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
పొట్టి బాతులు

మూడవ అట్ట:
ఆట కోతులు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# The ideal gift for the ideal hobby..




# BUNNY CAMERA

Think of the pleasure it will give you to introduce someone to the wonderful world of photography. Think of the pleasure it will give someone to own a Bunny Camera. And with a Bunny it's wonderful results from the very beginning — it's designed for easy operation and handling. In fact, getting professional-looking photographs is as easy as **ABC** with **A BUNNY CAMERA !**

**A Bunny Camera offers you so many distinctive advantages:**

**1.** *Strong, durable, steel plated metal body.* **2.** Shutter with 2 speeds: 1/25th and 1/50th, in addition to the usual 'B'. **3.** Simple 3-point focus settings, for sharper and better pictures. **4.** Two diaphragm settings for sunny and cloudy light. **5.** Direct eye-level view finder. **6.** Metal shoe for fitting flash gun. **7.** Socket to screw-on a tripod. **8.** Built-in yellow filter.

**Attractive ever-ready case available at extra cost.**

*The* **ABC** *of good photography* — **A BUNNY CAMERA**

**Manufactured by: CAMERA WORKS PRIVATE LIMITED**
**India House, Opp. G.P.O., Walchand Hirachand Marg, Bombay 1.**

**Distributors: Chokai Brothers Pvt. Ltd.,**
**Western India House, Sir Pherozeshah Mehta Road, Fort, Bombay 1**



## టివియస్ రిట్రెడులు భద్రతనిస్తాయి

టివియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్టు చూస్తాము. అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టివియస్‌కు ఇచ్చే ప్రతీ టైరూ కూడా ట్రెడ్‌ను వదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది. అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషీనులమీద మంచి నైపుణ్యతగల సాంకేతిక సిబ్బంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని టివియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు. ఆశ్చర్యము లేదు టివియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు పెట్టించే ప్రతీ రూపాయికి అధికంగా టైరు మైళ్ళనిస్తాయి.

మీరు టివియస్‌ను విశ్వసించవచ్చు— భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.

సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్
బెంగళూరు-కోయంబత్తూరు-కలమసేరి-మద్రాసు-పుదుకోట్టై-సేలం-సికింద్రాబాద్-తిరునెల్వేలి-విజయవాడ.




మీరు టివియస్‌ను విశ్వసించగలరు

SI 6073

బేబీ మరియు పరీక్షలు.






























dCP/GLT/9a tel

